

# అగస్త్యలింగశతకము

[సీసశతకము]

## శివభజనకీర్తనలు





గ్రంథకర్త:
కాడికొండ పూర్ణమల్లికార్జున అయ్యవార్లంగారు



ద్రవ్యసహాయులు :
విదర రాజమౌళిగారి రాజశేఖరంగారు,
వరంగల్.



ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల, బెజవాడ.

1935



# అగస్త్యలింగశతకము

[ సీసశతకము ]

## శివభజనకీర్తనలు



ప్రకాశక

తాడికొండ పూర్ణమల్లికార్జున అయ్యవార్లంగారు

ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల, బెజవాడ.

1935

# విన్నపము.

భక్తాగ్రేసరులారా!

వరంగలు, సీతంపేట మున్నగు గ్రామవాస్తవ్యులును, సద్గురుచరణ సేవాపరతంత్రులును, శివపూజాపరాయణులును, లక్ష్మీసంపన్నులును, ఆర్యవైశ్యకులాబ్ధిరాకాసుధాకరులును నగు చిదర రాజమౌళిగారి రాజశేఖరంగారును, చిదర చంద్రమౌళిగారి మల్లయ్యగారును, చిదర రాజశేఖరంగారి చంద్రమౌళిగారును, చిదర కుమారయ్యగారును, చిదర చంద్రమౌళిగారి సోమశేఖరముగారును, చిదర చంద్రమౌళిగారి పార్వతీశంగారును, చిదర చన్నమల్లుగారి బసవప్రభు కేదారలింగంగార్లును, చిదర రాజేశంగారి భీమలింగం, అక్కయ్యలింగంగార్లును తమ గురువరేణ్యులగు తాడికొండ పూర్ణమల్లికార్జున అయ్యవార్లంగారిచే రచింపబడిన యీ "అగస్త్యలింగశతకము"ను, "శివభజనకీర్తన"లను అచ్చొత్తించుటకైతగు ద్రవ్యమును సహాయముచేసి మా శుకశ్యామల రామలింగేశ్వరగ్రంథమాలాముఖమున సీస గద్య పద్యాత్మకమగు నీమాలిక, వేములవాడ రాజేశ్వరున కర్పించినందుల కెంతయు సంతసించుచు పీఠికవ్రాసి యొసంగిన బ్ర॥ వే॥ ముదిగొండ వీరేశలింగశాస్త్రి, పి. వి. యస్. వి. వి. గారికి అభివందనము లర్పించుచు అముద్రితములగు శివగ్రంథముల బ్రచురించు భక్తులకు పరమేశ్వరు డాయురారోగ్యైశ్వర్యాద్యుల నొసంగుగాత మని ప్రార్థించుచున్నాడ.

శివమ్.

నందిగామ,
కృష్ణాజిల్లా.

ఇట్లు నిగమాగమ విశారద,
ముదిగొండ వీరభద్రేశ్వరారాధ్యులు.



శ్లో. ప్రాతః స్మరామి పరమేశ్వరపుణ్యమూర్తిం
కర్పూరకుంద ధవళం గజచర్మచేలం
గంగాధరం ఘనకపర్దవిభాసమానం
గౌరీనిరంతరవిభూషితవామభాగమ్.

# పీఠిక.

శ్లో. అజ్ఞానతిమిరాన్ధస్య జ్ఞానాఞ్జనశలాకయా,
చక్షు రున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః.

గుణగ్రహణపారీణులగు నో భక్తాగ్రేసరులారా!

సంసారమహార్ణవము దాటుటకు మానవులకు భక్తి నావవంటిది. జననమరణములు, కష్టసుఖములు, తాపత్రయము-మొదలగు నామములతో నీ సముద్రమున తరంగపరంపర లరుదెంచుచుండును. ఈ భక్తినావ దౌర్భాగ్యప్రభంజనతాడితమై, ఏమూలనో, ఏసమయమందో తునాతునక లగుట కెట్టి యభ్యంతరమును లేదు. నిరపాయముగ నీ నావను చక్కని త్రోవను నడపించువారిలో గురువు చుక్కానివంటివాడు.

ఎప్పుడు గురుమూర్తి తాను పాశుపతదీక్ష నొంది లింగత్రయరహస్యము దెల్పి, లింగాంగసామరస్యము నుద్బోధించుచు శైవమతశాస్త్రమును బోధచేయునో అప్పుడు కాని శిష్యులహృదయకమలములు భక్తిమరందోన్మీలితములై గురుపదపంకజముద్రితములై నిరంతరము ప్రకాశించ నేరవు. అజ్ఞానతిమిరము బాపు జ్ఞానాంజనము నొసంగిన సద్గురుని చరణారవిందములు సదా స్మరణీయములు.

ఇట్టిపవిత్రమగు గురువంశమునకు జేరినవారిలో నీ యగస్త్యలింగశతకమును రచించిన మల్లికార్జునకవి యొకరు ఈ కవీశ్వరుని సచ్చరిత్రము శ్రోత్రపేయము గావించుకొనుట

సజ్జనకృత్యములలో నొకటి. కాన, సంగ్రహముగ నీ విద్వ ద్వతంసుని చరిత్రి విచారింతము.

## మల్లికార్జునకవిజీవితము.

ఈ కవీంద్రుని గృహనామము తాడికొండ. ఈగ్రామము గుంటూరుజిల్లాలో నున్నది. వీరి పూర్వులకు నివాసస్థాన మగుటచే వీరి కీ గృహనామము వచ్చియుండును. వీరికి పూర్ణయ్యశాస్త్రి యను వ్యవహారనామ మింకొకటి కలదు. గోత్రము భారద్వాజగోత్రము. సూత్రి మాపస్తంబసూత్రము. శాఖ యజుశ్శాఖ. కులము బ్రాహ్మణకులము. మతము శైవమతము (ఆరాధ్యులు). ఆనంద నామసంవత్సరమున జననము. (శాలి. సం. 1776). జన్మభూమి 'యీమని' గ్రామము. ఇది తెనాలితాలూకాలో నున్నది. జననిజనకులు బుచ్చమాంబా రాజలింగారాధ్యులు. ఈ బుచ్చమాంబ, శ్రీపతిపండితారాధ్యుల రాజలింగారాధ్యుల సత్పుత్రికయై, పతివ్రతాలలామ యని వన్నెకెక్కిన కాంతారత్నము. రాజలింగారాధ్యులుభయభాషలం దారితేరినవాడగుటయే కాక మంత్రశాస్త్రమునం దసాధారణప్రజ్ఞ నార్జించి ప్రసిద్ధికెక్కిన విద్వాంసులలో నుత్తముడు. ఈ దంపతులు సోమవారవ్రతము మొదలగు ననేక శైవనక్తవ్రతముల నాచరించి, 12 కార్తికనక్తవ్రత గణార్చనల జరిపి మాహేశ్వరుల నిష్టమృష్టాన్నసంతృప్తులనుగ జేసిన మాహేశ్వరభక్తిసంపన్నులు.

మల్లికార్జునకవిపితామహుడు మల్లనారాధ్యులు. వీరు సంస్కృతాంధ్రభాషాసాహితీకోవిదులు. మంత్రశాస్త్రప్రభా



గ్రంథకర్త:

పూర్ణమల్లికార్జున అయ్యవార్లుంగారు.

వమున 'నందివెలుగు' అను గ్రామమున తొమ్మిదియెకరముల యీనాము భూమిని సంపాదించిరి. మఱియు వీరు తమకు నివాసమగు ఈనునిగ్రామమున (తూర్పుదిక్కున చేయుటకై యొక వ్వాడు) అప్పటి ప్రభువతంసులగు శ్రీ శ్రీ మల్రాయ వేంకట గుండారాయ ప్రభువునొద్దకు వెళ్ళి యీశువుగా తొమ్మిది సీసపద్యములను, ఏకాక్షరప్రాస కలిగిన కందపద్యశతకమును జెప్పెను. మచ్చున కొకపద్యము నుదాహరించుచున్నాను.

సీ. తన నిరంతరదాన • ధారాప్రయోధికి
గగనవాహిని ఫేన • కణము గాఁగ
తనదు శాశ్వతయశో • ఘనసారమునకు బ్ర
హ్మాండములు పేటి • కాండములుగ
తన మహైశ్వర్యవై • దగ్ధ్యగాత్రికి రత్న
సానువు సికతప్పె • గా నమరఁగ
తన పరాక్రమబృహ • ద్భానుశిఖలకు ఖ
ద్యోతుండు ఖద్యోత • రీతిఁ వెలుఁగ
గీ. ప్రబల నితఁడని కవివరుల్ • ప్రస్తుతింప,
శ్రీరమాధీశుకరుణచేఁ • జెలఁగితౌర!
వైభవదలీప! మల్రాజ • వంశదీప!
గుణమణికలాప! వేంకట • గుండభూప!

క. కోరితి నీదగు దయ సుర
ధారణిరుహసురభికర్ణ • ధారాధరధా
త్రీరాజదానధుర్యా!
వీరాధిప! గుండభూప! • విభవదిలీపా!

ఈ శతకము చెప్పినపిమ్మట వేంకటగుండభూపాలుడు 'ఆరాధ్యులవారూ! మీ కేమి కావలయును?' అని యడుగ నీరెండుపద్యములు చెప్పెనట!

క. ధీరా! యీమనిపురమున
తూరుపు నామాన్యభూమి ♦ తూమెడుగింజల్
కారుకు పండవు దూరము
వీరాధిప! గుండభూప ♦ విభవదిలీపా!

క. కోరితి దీనిం గైకొని
మారుగ దక్షిణమునందు ♦ మాన్యము దమి నీ
పేరుగ నీయఁగ నాకును
వీరాధిప! గుండభూప! ♦ విభవదిలీపా!

ఆ తరువాత నా రాజచంద్రుడు పల్లనారాధ్యుల వారికి దక్షిణపుదిక్కున నిరువదియైదెకరముల భూమి నిచ్చి శాలువులతోడను, నూటపదారురూప్యములతోడను సత్కరించి పంపెనట!

ఈ మల్లికార్జునకవికూటస్థుడగు శ్రీశైలపతిగారు, శ్రీశైలప్రాగ్ద్వారమున తపస్సుచేసి శివానుగ్రహము నంది, వివాదములయందు బిల్వదళమునందు బంచాక్షరిని వ్రాసి దానితో దులాభారమున దూగియున్నారు. కావుననే నేటి వరకును వీరిశిష్యులు "శ్రీశైలప్రాగ్ద్వారప్రణవపంచాక్షరీ తులాభారప్రసిద్ధులు" అను బిరుదము పత్రికలందు వ్రాయు చున్నారు.

చెన్నబసవపురాణగ్రంథకర్తయగు అత్తలూరి పాప కవి యీకవివంశస్థుడగు నందీశ్వరుని, గురువుగ నుతించి యున్నాడు; చూడుడు-

ఉ. విశ్వకళాప్రవీణవరవీరుఁ డనేకకృపాణవైనతే
యాశ్వశిలీముఖాంఘ్రికమలామల భక్తధురీణ సత్కృపా
శాశ్వతనేత్రకోణ యని సారెకు నామది తాడికొండనం
దీశ్వరు మద్గురుం దలతు నిప్పుడు తాయవదేశికాత్మజున్.

ఇట్టి పండితవంశమునకు జెందినవాడే మల్లికార్జున శాస్త్రి. ఈ కవి బాల్యమునుండి, యుభయభాషాపాండితి నార్జించుటయు కాక సంగీతమంత్రశాస్త్రములందును మంచి ప్రతిభ నార్జించెను. ఈతనికి దేశికులు, అనగా లింగధారణ దీక్ష నిచ్చినవారు పండితారాధ్యుల రాజలింగారాధ్యుల వా రని యీతత్కవివిరచిత 'కూకద మారయ్య' కథలోని యీ క్రిందిపద్యమువలన దెలియుచున్నది.

ఉ. శ్రీపతి పండితాన్వయసుశేఖరు కౌశికగోత్రసంభవున్
దీపితభస్మలిప్తరుచిదేహు షడక్షరమంత్రసిద్ధునిన్
పాపవితానకానన విపాటనశాతకుఠారు శాంతస
ద్రూపుని రాజలింగగురురూఢిగ నామదిలో భజించెదన్.

ఈ కవి కిరువురు సోదరీమణులు కలరు. వీరిలో పెద్దది యగు రాజమ్మ, శ్రీపతి పండితారాధ్యుల జోగయ్యారాధ్యుల వారికిని, కనిష్ఠురాలగు భ్రమరాంబను పండితారాధ్యుల

కోటయ్యారాధ్యులవారికిని నిచ్చి వివాహము చేసిరి. వారి వంశములు తామరతంపరగ నభివృద్ధిలో నున్నవి.

మల్లికార్జునశాస్త్రి అష్టవిధార్చనాపరతంత్రుడు. షట్కాల శివపూజాధురంధరుడు. శ్రీగుంతెమగు శిష్యసంతతి గలవాడు. పలువురువిద్యార్థులకు విద్య చెప్పిన ధర్మశీలుడు. వీరికి మొట్టమొదట ఇవటూరి మల్లయ్యగారి కూతు నిచ్చిరి. ఆమె యచిరకాలముననే లింగైక్యము చెందెను. తరువాత జగ్గయ్యపేటవాస్తవ్యులగు శివపురం కోటయ్యారాధ్యసత్పుత్రిక రాజేశ్వరి నిచ్చిరి. ఆమెకు 1 భ్రమరాంబ, 2 పూర్ణానందము అను నిరువురు సంతానము మిగిలిరి. మల్లికార్జునకవి తనపెద్దమేనల్లునకు కూతు నిచ్చి వివాహము చేసెనుకాని, ఆ బాలిక కొలదికాలములోనే దివంగతురాలాయెను. ద్వితీయ భార్యాసంతానములో పూర్ణానందముమాత్రి మొక్కడు కలడు. అతనికి, శివపురము వీరభద్రారాధ్యులవారికుమార్తె వగస్త్ర్యేశ్వరి నొసగిరి.

మల్లికార్జునశాస్త్రి తనద్వితీయభార్య, తనకుమారుని బాల్యముననందే మరణించగా కళ్ళికోటనుండి మీనాక్షమ్మ అను నామెను తిరిగి వివాహముచేసికొనెను. ఈమెకు అయిదుగురు కుమారులు. పెద్దవాడు నాగవీరయ. ఇతనికి శి. భోగయ్యగారికూతు నొసంగిరి. మల్లికార్జునకవివంశవృక్ష మీ క్రింద నిచ్చుచున్నాను.

- శ్రీశైలపతి
  - కాయప్ప
    - నందికేశ్వరుడు
      - సోమయ్య
        - రాజలింగారాధ్యులు
          - పెద్దబ్రహ్మయలింగము
          - మల్లనారాధ్యులు
            - పర్వతాలు
            - రాజలింగారాధ్యులు
              - మల్లికార్జునకవి
                - పూర్ణానందము
                - నాగవీరము
                - వీరభద్రము
                - లింగమూర్తి
                - మల్లికార్జునుడు
                - వటుకప్రసాద్
          - చినబ్రహ్మయలింగము
            - పిచ్చయ్య
              - అగస్త్యలింగము
                - కనకలింగము
                - అగస్త్యలింగము
              - కోటయ్య
                - మల్లికార్జునుడు
                - రాజలింగము
              - పంచాక్షరిలింగము

వీరికి శిష్యులు వరంగల్, చాందా, నాగపూర్, కామిరీ, అశనపర్తి, సీతంపేట, కోరిపల్లి మున్నగు గ్రామము లందు గలరు. వీరి శిష్యులు వలుసమయములందు వీరికి ధన సాహాయ్యము చేసిరి. వరంగల్లునందు శైవరహస్యముల ననేకు లకు బోధించి పేరుగాంచిన మతాభిమానులలో మల్లికార్జున శాస్త్రిగా రొకరు. వీరిచే రచించబడిన గ్రంథముల నిట నుదా హరించుచున్నాను. 1 హరిశ్చంద్రోపాఖ్యానము (అచ్చ తెలుగు ప్రబంధము, అముద్రితమును.) 2 కూకదమారయ్యకథ 3 శ్రీయాళునికథ 4 కాదప్రసత్తెక్క కథ 5 మైథున రామయ్యకథ (ఇవి శివకథలు, అముద్రితములును.) 6 సిద్ధేశ్వర శతకము 7 అగస్త్యలింగ శతకము 8 భజన కీర్తనలు 9 రామేశ్వరయా త్రాతటస్థక్షేత్ర దేవతా పంచరత్నములు, అష్టకములు.

ఈ కవి రచించిన హరిశ్చంద్రోపాఖ్యానమునుండి కవి తాశైలి తెలియుటకై మచ్చున కొకపద్యము నుదాహరించు చున్నాను.

సీ. తల నాకపంపుజాలు ♦ మొలను బెబ్బులితోలు
మేన వెన్నెలడాలు ♦ మెఱుఁగు లీన
చేత కంకటితుండు ♦ సికను జాబిలితుండు
నెదను తాచులపిండు ♦ కుదురు దనర
నుదుట మండెడికన్ను ♦ పెదవి నగవుచెన్ను
కురువునందలియన్ను ♦ కులుకుగమర
పూపజక్కవతేని ♦ మాపు నెన్నఁగరాని
జడలకొమ్ముడిజిగి ♦ సౌరు చెలఁగ

తే. తెల్లముగ చంక నొకజింక ♦ పిల్ల నిడుక
పున్కపచ్ఛ్యగ మొకచేతఁ ♦ బూని మిగుల
మత్తగిల్లిన తెల్లని ♦ గిత్త నెక్కి
కనికరంబున నా మ్రోలఁ ♦ గానుపించె.

ఈతనికవిత్వము రసవంతమై ద్రాక్షాపాకమును బోలి యుండును. ఈశతకమునందుగూడ ననేకభక్తుల సచ్చరిత్రములును, శైవమత సంప్రదాయములును నిమిడియున్నవి. అవి యన్నియు నిట చర్చించుట గ్రంథవిస్తర మని యుపేక్షించితిని.

ఈ మల్లికార్జునకవియంత్యదశకూడ మహావిచిత్రమైనది. ఇరువదియొక్కవేయి ఆరునూఱులు (21,600) జపము నిత్యము చేయు నామహానీయుని తపస్సు ఫలించినదే యని చెప్పవచ్చును. శ్రీముఖ సం. మాఘ బ ౧౩ర మహాశివరాత్రి యందు లింగోద్భవకాలమున శిష్యులకు మతసంశయముల దీర్చుచు మహాదేవనామస్మరణ మొనర్చుచు శివసాయుజ్యము నొందిన మల్లికార్జునశాస్త్రిపూర్వపుణ్య మగణ్యము.

వీరు లింగైక్యము జెందినతరువాత వరంగల్ వాస్తవ్యులగు చిదరవారు లింగప్రతిష్ఠాదులకు గాను వలయునంత ధనసాహాయ్యము చేసిరి. ఇట్టియుత్తములగు శిష్యులుగాని కుమారులుగాని మల్లికార్జునశాస్త్రివిరచితములగు సద్గ్రంథముల నన్నిటిని ముద్రింపజేసి శాశ్వతమగు కీర్తి నొంది చిరాయురారోగ్యైశ్వర్యపుత్రపౌత్రాభివృద్ధి నొందుటకై భక్తసుందా

షులు, పురాణదంపతులు నగు నాయుమామహేశ్వరుల కనేక నమోవాకము లొనర్చుచు నింతటితో నాలేఖినికి విశ్రాంతి నొసంగుచున్నాడను.

ఇట్లు,

సంస్కృతవిద్యాశాల,
ది.26—1—1935, ఓరుగల్లు.

ముదిగొండ వీరేశలింగశాస్త్రి,
P. V. S. V. V.



కీ. శే. చిదర రాజమౌళిగారు.





శ్రీ శివాభ్యాం నమః.

# అగస్త్యలింగశతకము.

సీ. శ్రీగిరిజాసతీ♦చిత్తాబ్జరోలంబ
భక్తహృత్పద్మినీ♦భానుబింబ
తారకాచలవాస ♦ తారతారకభాస
భూరిశైలశరాస ♦ బుధవిలాస
ఇందుఖండవతంస ♦ ఈడితమునిహంస
యహిభూషితాంస సం♦హతనృశంస
హారగణపరివార ♦ హతపురాసురవార
శరనిధితూణీర ♦ శర్వ ధీర
తే. పరమపావననామ స♦ద్భక్తధామ
అభయవిశ్రాణనసుశీల ♦ అజినచేల
అంగజవిభంగ పరమద♦యాంతరంగ
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౧

సీ. మందారమకరంద♦బృందారవింద సం
క్రందనాశ్వ మృగేంద్ర♦రమ్యదేహ
నారీకృతస్వాంగ ♦ హారీకృతభుజంగ
దూరీకృతానంగ ♦ దురితభంగ
దారుకారణ్యసం♦చార మౌనివ్రజ
దారవారాభీక ♦ తారరూప
శ్రీశార్చితా శర్వ♦రీశావతంస కీ
నాశాపలేశవి♦నాశ యీశ
గీ. భర్గ కృతసర్గ మౌనిరా♦డ్వర్గవినుత
విశ్వరూప సనాతన ♦ వేదవేద్య
శయధృతకురంగ రాజత♦శైలసంగ
ఈమనియగస్త్యలింగ పు♦ష్పేషుభంగ.

సీ. పులితోలు మొలకట్టు ♦ తెలిగట్టు నీపట్టు
నిప్పు నుదుటబొట్టు ♦ నింగి జుట్టు
కేల ముమ్మొనవాలు ♦ తోలు నెమ్మొయి శాలు
మేనఁ జక్కనిసొమాలు ♦ మినుకువాలు
తళుసులు నీడండ ♦ తెరుచుగా మెడనిండ
పుఱ్ఱెలదండ పె♦న్బూది నిండ
గాలిమేతరి పేరు ♦ నేల చెల్వగు తేరు
నీకు సొంపగు సౌరు ♦ మాకుఁ జూడ
గీ. గరము బీతగు మది జేసి♦కంటి వేల్ప
నీకుఁ గావించెద జోహారు ♦ నీకు మారుఁ
బ్రోవు మెప్పుడు గొడవలు ♦ బొడమకుండ
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ.

సీ. భారతీదేవి నీ ♦ పార్శ్వమందున నిల్చి
యింపుతో వీణ వా♦యింపుచుండ
పురుహూతుఁ డొకవంకఁ ♦ బూని వేణువున నీ
పావనకథలను ♦ బాడుచుండ
జలజాసనుం డొక♦ చక్క తాళము వేయ
పద్మయు భరతక♦ల్పనము జేయ
హరి మృదంగంబును ♦ భరతమార్గములచే
సొంపొదవంగ వా♦యింపుచుండ
గీ. అమరులందరుగూడి య♦త్యద్భుతంబు
దోపఁజూచుచునుండఁ బ్ర♦దోష వేళ
నాట్యమును సల్పు ఘనుఁడవు ♦ నాగభూష
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౪

సీ. భూమి రథంబు జాం♦బూనదశైలంబు
చాపంబు శింజిని ♦ సర్పరాజు
శతధృతి సారథి ♦ జలజాక్షుఁడు శరంబు
శశిభాస్కరులు రథ♦చక్రయుగము
నాల్గువేదంబులు ♦ నాలుగుగుఱ్ఱముల్
శరధి శరధికాఁగ ♦ సమరమునను
త్రిపురారివీరులఁ ♦ దెగటార్చుటకు నివి
యాడంబరమె కాని ♦ యాత్మఁదలప
గీ. నివియు నీకేల? లయకాలుఁ♦డవు నిమేష
మాత్రమునఁ జూడ భస్మమౌ ♦ ధాత్రి యంత
యిచ్చ గలిగెనుగాని మ♦హేశ నీకు
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౫

సీ. ఎందుఁ జూచినను నా • యెదుట నీనెమ్మోముఁ
జూపింపుమయ్య నా • దాపునుండి
కలలోననైన న • వ్వులు దోఁప మృదువులౌ
పలుకులు విన నీవు • పలుకవయ్య
కడుసుషుప్తిని నేను • గనలేకయుండిన
నండఁబాయక పజ్జ • నుండవయ్య
దిక్కు నీ వని నిన్ను • మ్రొక్కుచుంటఁగదయ్య
వేరె వేల్పుల నేను • వేడనయ్య
తే. ఉల్లమందున నీజ్ఞాన • మొకటి యెపుడు
వాక్కునను నీదునామంబు • నొక్కటియును
సంతతము నీదుభక్తి యా • చింతునయ్య
ఈమునియగస్త్యలింగ బా • లేందుసంగ. ౬

సీ. నేరమా నిను వేడ • భారమా నన్నుఁ బ్రోవ
బీరమా నాతోడ • బిడ్డ నయ్య
పెంచరా కనికర • ముంచరా దురితముల్
త్రెంచరా నాయందు • దృష్టి యుంచి
సారమా జన్మవి • చారమా యిది బాప
దూరమా నీయునికి • గారవింప
భక్తియే నీయందు • రక్తియే నిను జూడ
ముక్తియే వేడెద • భక్తవరద
గీ. భుక్తిముక్తుల నిచ్చెడు • పుణ్యమూర్తి
వీవెకాక ధరిత్రియం • దెవని నెఱుఁగ
నిపుడు నీపాలఁబడితి నా • కేమికొఱత
ఈమునియగస్త్యలింగ బా • లేందుసంగ. ౭

సీ. సారంబులేనిసం • సారంబు నెర నమ్మి
నీయందుఁ జిత్తంబు • నిలుపరయ్య
ఆలుబిడ్డలు నిత్య • మని నమ్మికొనియుండి
నీయందుఁ జిత్తంబు • నిలుపరయ్య
ధనము నిత్యం బని • ధర నిడి కాంక్షచే
నీయందుఁ జిత్తంబు • నిలుపరయ్య
బంధువులను నమ్మి • భాగుగఁ బెట్టుచు
నీయందుఁ జిత్తంబు • నిలుపరయ్య
గీ. అతిథులన్నను కానంత • యరయరయ్య
అతిథియన నీవె వేరగు • నయ్య తలఁప
జ్ఞానశూన్యత్వమున నిది • కాన లేరు
ఈమనియగస్త్యలింగ! బా • లేందుసంగ! ౮

సీ. నీపంచముఖములు • నే విచారింపఁగాఁ
పంచభూతంబులై • పరగుచుండె
నీపంచముఖములు • నే విచారింపగాఁ
పంచాక్షరంబులై • పరగుచుండె
నీపంచముఖములు • నేవిచారింపఁగాఁ
పంచలింగంబులై • పరగుచుండె
నీపంచముఖములు • నే విచారింపఁ బం
చబ్రహ్మమనువులై • పరగుచుండెఁ
గీ. పంచముఖములచేత నే • పంచవిషయ
ములఁ గ్రహింపఁ జిదానంద • మూర్తి వగుచు
వెలయుచుంటివి నీ వెప్డు • విమలమూర్తి!
ఈమనియగస్త్యలింగ! బా • లేందుసంగ! ౯

సీ. శ్వేతుండు వేశ్యకై ♦ చేరి పువ్వులు కోయ
నొకపువ్వు చెయిజారి ♦ యుర్విఁబడఁగ
నిదియు శివికి ముట్టె ♦ నిట్లని వల్కఁగ
నింపుతో మోక్షంబు ♦ నియ్యలేదె
కిన్నరబ్రహ్మయ్య ♦ కిన్నెర వాయింప
నిత్యంబు నొకమాడ ♦ నియ్యలేదె
వాసి వాసి యటంచు ♦ వదరినయంతనే
పెద్దయ్యకును ముక్తి ♦ ప్రేమ నియవె
గీ. నిన్ను శ్రమపడి పూజింప♦కున్న నేమి
భక్తులకు సులభుండవై ♦ పరగి తీవు
భక్తవాత్సల్య ముండఁగా ♦ బాధ లేల
కలుషచయభంగ! యీమన్య♦గస్త్యలింగ! ౧౦

సీ. తల్లి నీ కుండిన ♦ దయలేక విషమును
భక్షింపఁ జూచునే ♦ పట్టుకొన
తండ్రి నీ కుండినఁ ♦ దగ దని కాటిలోఁ
బొరలంగనిచ్చునే ♦ కరుణలేక
వేరె నీకంటెను ♦ బెద్ద లుండిన నస్థు
లను దాల్పగా నూరు♦కొసఁగలారె
దిక్కు లేకను నీవు ♦ తివిరి పున్కను బట్టి
బికిర మెత్తుదు వాడి♦భిక్షు వగుచు
గీ. భక్తు లియ్యక గతి లేదు ♦ భవున కెందు
ననెడి లోకోక్తి నీయందు ♦ ననుసరించె
నీదునామంబు ముక్తికి ♦ నిచ్చెనయ్య
ఈమనియగస్త్యలింగ! బా♦లేందుసంగ! ౧౧

సీ. చామీకరనగంబు ♦ చక్కనినీవిల్లు
నుండుటకును వెండి ♦ కొండయిల్లు
రక్తి నాపైఁ గృపా♦రసమును వెదజల్లు
తెలిమేన భస్మంబు ♦ చలువమల్లు
నీదయ యుండిన ♦ నిఖిలయత్నము చెల్లు
నీకొమరుని పుట్టి♦నిల్లు త్రెల్లు
నీయాఁపు కనులలో ♦ నిమిడిన వరిముల్లు
తివిరి ముల్లున నీవు ♦ తేజరిల్లు
గీ. చుండి జగమెల్ల వెలిగించు♦చుండి జగము
నీవె మైయుండి భేదంబు ♦ నావగింజ
యంత మైనను లేకుండ ♦ నలరితీవు
ఈమనియగస్త్యలింగ! బా♦లేందుసంగ! ౧౨

సీ. ఇంద్రనీలపుచాయ ♦ కెనయగు మెడకప్పు
కాయము స్ఫటికంపు♦కాంతి నొప్పు
చక్కని కెంజాయ ♦ జడలు చుట్టినకొప్పు
కాయజుఁ గాల్చిన ♦ కంటినిప్పు
తనర నీ వేషంబు ♦ దాల్చుట నీ కొప్పు
బహుపాశబంధముల్ ♦ పాయవిప్పు
నిన్ను నే సేవింప♦నున్నను నాతప్పు
నీవు ప్రోవకయున్న ♦ నీదితప్పు
గీ. తప్పునర్పితినేని నీ♦దండ నన్ను
జన్మమైదు విధించి యీ ♦ జన్మభూమి
తొక్కకుండఁగఁ జేయుము ♦ నిక్క మిదియ
కలుషచయభంగ! ఈమన్య♦గస్త్యలింగ! ౧౩

సీ. భక్తుఁడొక్కఁడు నీకు ♦ భాగ్యచర్మముఁ గోసి
గట్టిగా చెప్పులు ♦ కుట్టి యిచ్చె
భక్తు నొక్కనిగాంచి ♦ బానిస నడుగఁగా
భార్యను నీ కిచ్చె ♦ భక్తితోడ
ఒక్కఁడు విధి గాన ♦ కుండ నిన్బూజించి
అచ్చెరు వొంద క ♦ న్నిచ్చె నీకు
మక్కువ లేకుండ ♦ నొక్కఁడు సుతుఁ జంపి
దండిగా మాంసంబు ♦ వండిపెట్టె
గీ. అట్టిభక్తులు నేఁడు లే ♦ రయ్య నీవు
సుతునిమాడ్కిని నన్ను ♦ జూచి ప్రోవ
వయ్య! నే నెంతవాఁడ నీ ♦ యవనియందు
కలుషచయభంగ! ఈమన్య ♦ గస్త్యలింగ! ౧౮

సీ. వందారుసందోహ ♦ మందార! సచ్చిదా
నందస్వరూపాభి ♦ వందనీయ
ఫాలాంతరాళాగ్ని ♦ కీలావళీదగ్ధ
కీలాలజాశుగ ♦ శూలహస్త
స్మేరాననా! జటా ♦ భార స్తంబేరమా
పారపీడాపవి ♦ దారమిత్ర
దాసావనా! చిదా ♦ భాసాశ్రితాంతర
వాసా సదానంద ♦ భాసమాన!
గీ. నిత్యుఁడవు నీవు సకలంబు ♦ నీవు స్వభ్రి
కాముఁడవునయి భక్తులఁ ♦ గరుణఁ బ్రోవ
సగుణుఁడవు నైతివయ్య నీ ♦ శక్తి నహహా!
కలుషచయభంగ ఈమన్య ♦ గస్త్యలింగ. ౧౯

సీ. కందర్పముఖ సుర♦బృందార్చితపదార
విందా శరత్కుంద♦సుందరాంగ
కాలానలాభీల ♦ హాలాహలాహార
నీలాయితగ్రీవ ♦ ఫాలనయన
ఆశాంబరాజన్మ♦పాశాహిసందోహ
వేశా భవాకాశ♦కేశ ఈశ
శాంతావళీహృన్ని♦శాంతా శివాకాంత
నితాంతకావలే♦పాంతరహిత
గీ. కుండలీట్కుండలాంచిత♦గండయుగళ
చంద్రశకలపరిష్కృత ♦ జాటజూట
సకలనిగమాంతసంవేద్య ♦ శర్వ భర్గ
కలుషచయభంగ ఈమన్య♦గస్త్యలింగ. ౧౬

సీ. నిఖిలజగములకు ♦ నిలయంబు నీకుక్షి
చుట్ట మాటకు ముని♦సుతుండె సాక్షి
పడగను భువిఁ దాల్చు♦ఫణిరాజు నీనారి
నిచ్చలు నెద్దుపై ♦ నీసవారి
సర్వకార్యములందు ♦ సఖుఁడనదగు శౌరి
భక్తులయందు నీ♦బల్ కచేరి
సకలమంత్రములకు ♦ స్థానమా నీ వాయి
నెరి ప్రీశయంబున ♦ నీబడాయి
గీ. మమ్ము దయఁ జూచువరకును ♦ మాకు హాయి
లెంకనై నిన్నుఁగొల్వఁగా ♦ లేదు పోయి
యెటు లయిన నను బ్రోవంగ ♦ నీవె దిక్కు
కలుషచయభంగ ఈమన్య♦గస్త్యలింగ! ౧౭

సీ. నీమనికి నాయునికి ♦ నిత్యంబు నొక్కటి
గాఁ జేయుమయ్య నీ♦కరుణ యుంచి
నీచూపు నాచూపు ♦ నిత్యంబు నొక్కటి
గాఁ జేయుమయ్య నీ ♦కరుణ యుంచి
నీరూపు నారూపు ♦ నిత్యంబు నొక్కటి
గాఁ జేయుమయ్య నీ♦కరుణ యుంచి
నీవు నే ననకుండ ♦ నిత్యంబు నొక్కటి
గాఁ జేయుమయ్య నీ♦కరుణ యుంచి
గీ. నీవు నే నను భావంబు ♦ నీల్గుదనుక
భక్తిమాత్రంబు నీయందుఁ ♦ బర్వఁ జేయు
మయ్య మరియొక్కటియు వేడ♦నయ్య నిన్ను
కలుషచయభంగ ఈమన్య♦గస్త్యలింగ. ౧౮

సీ. వటమూలమున నీవు ♦ వసియించియుండఁగా
సంశయమున ముని♦సమితి వచ్చి
మ్రొక్కి స్తుతించి నీ♦మ్రోలఁ గూర్చుండఁగా
సత్స్వరూపుండవై ♦ సంతసమున
చిన్ముద్రను ధరించి ♦ చెలఁగుచుండఁగ నీవు
ఛిన్నసంశయులయి ♦ చిత్తమందు
సంతోషముప్పొంగఁ ♦ జనిరి తత్క్షణమున
వారు గన్గొన్నది ♦ వారి కెఱుక
గీ. నీవు తెల్పిన దెద్దియో ♦ నీకె యెఱుక
తెలుపఁ దగినట్టివస్తువు ♦ దేవ నీవె
కాన నీదర్శనం బిడి ♦ కావుమయ్య
కలుషచయభంగ ఈమన్య♦గస్త్యలింగ. ౧౯

సీ. పార్వతీహృదయాబ్జ♦బంభర భానుకో
టిసమప్రభాజిత♦కుసుమచాప
శర్వరీశవతంస ♦ శంకర శాశ్వతా
పరమేశ్వరా నుత♦పంకజాక్ష
శర్వరీచరబృంద♦సంహారశాతబా
ణ కృపాకరా భర్గ ♦ నాగభూష
శర్వ మృత్యువిదార ♦ సారసశారదా
భకళేబరా దేవ ♦ భక్తపాల
గీ॥ భుక్తిదాయక పరమేశ ♦ భూతనాథ
కమలసంభవముఖదేవ♦గణసమర్చి
తాంఘ్రియుగళ సదాశివ ♦ యభ్రకేశ
కలుషచయభంగ ఈమన్య♦గస్త్యలింగ. ౨౦

సీ॥ సురపతి సురముఖ♦సురవరచయముకు
టమణికిరణపద♦కమలయుగళ
పరిసరపరిజన♦నత వరమునిజన
సజమలమనుయుత ♦ హృదయసదన
దరహిమశశధర♦హరివరసురహరి
కమలజహరినిభ ♦ విమలకరణ
మనసిజ హరభవ ♦ వనజనయన శర
తరణిసదన శివ♦యురగభరణ
గీ॥ అభవ పురహార భవహార ♦ హరిణభరణ
శశిశకలధర త్రినయన ♦ శమనదమన
నిరతమును మదిఁ దలఁచెద ♦ శరణు శరణు
కలుషచయభంగ ఈమన్య♦గస్త్యలింగ. [సర్వలఘు]

సీ॥ దశరథసుతునకు ♦ దయను దీక్ష నొసంగి
కడగండ్లనణచిన ♦ ఘనుఁడ వీవు
కాలుని గూలిచి ♦ కరుణతో ఋషిసుతుఁ
గాచి రక్షించిన ♦ ఘనుఁడ వీవు
హాలాహలాగ్నిని ♦ హరియించి సురలను
కరుణఁ జూచినయట్టి ♦ ఘనుఁడ వీవు
విధికి శిక్ష విధింప ♦ విని స్కందు లాలించి
వలదని ధాతను ♦ వదలి తీవు
గీ. అరయ నీ వెట్లుతలఁచిన ♦ నడ్డులేదు
నీవు సర్వజ్ఞుఁడవు నన ♦ నీకె చెల్లు
గాక యెవరికిఁ జెల్లదు ♦ కాలకంఠ
కలుషచయభంగ శ్రీమద ♦ గస్త్యలింగ. [నిరోష్ఠ్య] ౨౨

సీ. సిరులఁ దేలెడివాఁడ ♦ సికను జాబిలివాఁడ
కేల నంజిగివిను ♦ చూలి తేజి
గలవాఁడ గౌరుతో ♦ ల్గలవాఁడ విన్నకొ్రి
మ్ముడివాఁడ సామేన ♦ ముగుదవాఁడ
గిత్త నెక్కినవాఁడ ♦ ముత్తిబుత్తు లొసంగ
జాల్వాఁడయాదలఁ ♦ జాలువాఁడ
తోలుకడతేనిరా ♦ ల్దారజిగికుత్తుక
గలవాఁడ దొసగులఁ ♦ దొలచువాఁడ
గీ. తపసియేలికచా ల్మది ♦ తమ్మితేటి
యై చెలంగినవాఁడ నా ♦ యందు నీవు
కనికరముఁ దోపఁ బ్రోవుము ♦ కస్తి బాపి
కలుషచయభంగ శ్రీమద ♦ గస్త్యలింగ. ౨౩

సీ. పొంగట్టు సింగాణి ♦ పుట్టనట్టువ పెద్ద
వారియు తరిగట్టు♦దారి ముల్కి
పంటవలఁతి తేరు ♦ పాల్బల్కులు గురాలు
బమ్మ తేరునడపు♦బంటువాఁడు
చలిక్రొల్లుపొద్దులు ♦ చక్కనిగీరలు
సందర్భింబు దొనయు నై ♦ జానుమీఱ
దిగప్రోల్లఁ గూలిచి ♦ దేవళ్ల కెంతయు
మే లొనరించిన♦మేటివేల్ప

గీ. బత్తిచేతను నీమీఁద ♦ బత్తి రిడిన
బుత్తిముత్తుల గెంటిని ♦ పొదత నిచ్చు
దొరవు, నీకన్న నా కెందు ♦ దొరక రయ్య
కలుషచయభంగ ఈమనవ్వ♦ గస్త్యలింగ. ౨౮

సీ. మున్నుసురాసురుల్ ♦ మున్నీరు దరువంగ
వరమందరాద్రి క♦వ్వముగఁ జేసి
వాసుకి త్రాడుగాఁ ♦ జేసి వైకుంఠుండు
కూర్మమై యడుగున ♦ గూడుకొనఁగ
తత్తరపాటుతోఁ ♦ దరచంగఁ దరచంగ
భగ్గున విషవహ్ని ♦ జయలుదేర
స్తుతియింపఁగా నీవు ♦ తొడరి భక్షింప న
త్తరి మథింపఁగ నమృ♦తంబు పుట్టె

గీ. దానికై సురదైత్యులు ♦ తగవులాడ
విష్ణు వప్పుడు మోహిని♦వేష మూన
శాస్త్ర భైరవుఁ గంటి వా♦శార్ఙ్గియందు
ఈమనియగస్త్యలింగ పు♦ష్పేషుభంగ. ౨౯

సీ. పురహర నిన్ను నే ♦ పూర్వజన్మంబున
క్షణకాల మైన మ్రొ♦క్కని తెరంగు
కనుగొంటి నీజన్మ ♦ కలుగుటచే నిప్డు
మ్రొక్కినవెంటనే ♦ ముక్తి కలుగు
నతనుండనై ముందు ♦ నతి యొనర్పనివాఁడ
నగుదు నే నేమి చే♦యంగగలను
దోఁచకున్నది నాకు ♦ తుది జేయగలయుపా
యంబుఁ జెప్పుము చెప్పు♦వైతివేని
గీ. యిట్టియపరాధయుగ్మము ♦ నెవఁడు నణఁచ
నోపఁగలవాఁడు లేఁడయ్య ♦ యుర్వియందు
గాన నీవె క్షమింపుము ♦ కరుణతోడ
ఈమనియగస్త్యలింగ పు♦ష్పేషుభంగ. ౨౬

సీ. నీశక్తి యొకటియె ♦ నిక్కంబుగా నాల్గు
విధములై యంతట ♦ వెల్గుచుండె
నీభోగమున భవా♦నీరూపమును దాల్చి
యుండెను విభువకీ ♦ నూరువందు
పురుషులయందున ♦ పుండరీకాక్షుఁడై
వెలయుచునుండెను ♦ వివిధగతుల
క్రోధమందున మహా♦ఘోరరూపిణి యయి
కాళినామంబున ♦ గ్రాలుచుండె
గీ. సమరమున దుర్గయై యుండె ♦ సంతతంబు
నంతటను జూడ నీశక్తియై ♦ చెలంగె
నీవు లేనట్టివస్తువు ♦ నేను గాన
ఈమనియగస్త్యలింగ పు♦ష్పేషుభంగ. ౨౭

సీ. ఎదను దన్నునటంచు ♦ మది భయంపడి యర్క
సూనుండు పరుగిడు ♦ కానకుండ
అమరులందరు కిరీ♦టాంచితరత్నదీ
ప్రోజ్జ్వలారాత్రిక ♦ లొసఁగుచుండ్రు
ముక్తికామిని వచ్చి ♦ ముదమునఁ దనియించు
గాటపుఁగౌగిళ్ళఁ ♦ గదియనొత్తి
పాయక చిత్తంబు ♦ భవదీయపదముల
యందు నిల్పినవాని ♦ కవనియందు
గీ. కొరత కాసంత లేదయ్య ♦ కోసరి నిన్ను
భక్తిమాత్రమె యాచింతు ♦ రక్తిమీర
సారెసారెకు నిక వేడ ♦ చాలు నిదియ
ఈమనియగస్త్యలింగ పు♦ష్పేషుభంగ. ౩౮

సీ. ఆశుగంబయి నరా♦హంబయి సుఖుఁడయి
యశ్వమై సామేన ♦ నంగన యయి
మార్దంగికుండయి ♦ మరియు ననేక రూ
పంబులు దాల్చి నీ♦పాదపద్మ
మున నేత్రముంచి నీ♦తనువునంశముఁ గాంచి
పూజ్యాలయుం దరు♦పూజ్యుఁడైన
హరికన్నఁ జూడగాఁ ♦ నధికుఁ డీరేడు జ
గంబులం దెవఁడయ్య♦ గరళకంఠ
గీ. భక్తియింతకు ♦ మూలంబు భక్తి ముక్తి
దాయకంబగు గాన నీ♦దయను భక్తి
యిచ్చి ననుఁ బ్రోవుమయ్య యీ♦పృథివియందు
ఈమనియగస్త్యలింగ పు♦ష్పేషుభంగ. ౩౯

సీ. యముఁడు బాధింప సం◆యమిసూనుకడ కేగి
చిరజీవి నాతని ◆ చేయలేదె
అమరులు నిను వేడ ◆ హాలహాలంబు నణంచఁ
బోయి నీకుత్తుకఁ ◆ బూనలేదె
దారుకావనముని◆దారలఁగమిఁ గూడ
తిరిగి మునులను ◆ కడతేర్పలేదె
అద్రికుమారిని ◆ నంకమందునఁ జేర్చి
యనుకంపమునను ము◆ద్దాడ లేదె
గీ. అట్టి దయ నీకు నామీఁదఁ ◆ బుట్టదేలఁ
ఖలుఁడు వీఁడని మదినెంచి ◆ కనికరంబు
లేక యున్నావొ తగదు నీ ◆ కెంకనయ్య
ఈమునియగస్త్యలింగ పు◆ష్పేషుభంగ. ౩౦

సీ. పితృవనమందునఁ ◆ బ్రీతిమై నుండుట
సహచరులై పిశా◆చములు గొల్వ
అటుల చితాభస్మ ◆ మనులేపనము గాఁగ
నరకపాలంబులు ◆ సరులు గాఁగ
అరయఁగా నీశీల ◆ మశుభమై యుండిన
నిన్నుఁదలంచెడి ◆ నిఖిలభక్తు
లకు గనుగొనమంగ◆ళ స్వరూపుండవై
తివి యద్భుతంబగు ◆ నవనియందు
గీ. రక్తబీజాదిదైత్యుల ◆ రస నడంచి
రక్తమునుబీల్చి నరముల ◆ రక్తిదాల్ప
నార్యయును సర్వమంగళ ◆ యయ్యెనౌర
మీర లెద్ది యొనర్చిన ◆ మేలు భువిని
యీమునియగస్త్యలింగ పు◆ష్పేషుభంగ. ౩౧

సీ. కైలాసవాసాయ ♦ కామితఫలదాయ
ఫాలేక్షణాయ తుభ్యం నమోస్తు
శమనగర్వహరాయ ♦ చంద్రఖండధరాయ
పార్వతీశాయ తుభ్యం నమోస్తు
ఓంకారరూపాయ ♦ ఉరగేంద్రహారాయ
పాశహరాయ తుభ్యం నమోస్తు
మునిజనస్తోత్రాయ ♦ మురవైరిమిత్రాయ
భవహరణాయ తుభ్యం నమోస్తు
గీ. భక్తజనరక్షణాయ తుభ్యం నమోస్తు
స్ఫటికమణిసన్నిభాయ తుభ్యం నమోస్తు
అనుచు నిన్ను నుతించెద ♦ నహరహంబు
నీమనియగస్త్యలింగ పుష్పేషుభంగ. 3౨

సీ. వేదాంతవేద్యాయ ♦ విమలాంతరంగాయ
మౌనిహృన్నిలయాయ ♦ తే నమోస్తు
శాంతాయ స్వప్రకాశాయ నిర్లేపాయ
జ్ఞానస్వరూపాయ ♦ తే నమోస్తు
వృషభేంద్రవాహాయ ♦ విషధరాభరణాయ
ఫేనఖండధరాయ ♦ తే నమోస్తు
పవనాశనాధీశ♦పర్యంకవిశిఖాయ
భానుమధ్యస్థాయ ♦ తే నమోస్తు
గీ. భానుశశివహ్నినేత్రాయ ♦ తే నమోస్తు
దీనజనపారిజాతాయ ♦ తే నమోస్తు
అనుచు నిను వినుతించెద ♦ నఘువిదూర
యీమనియగస్త్యలింగ బాలేందుసంగ. 33

సీ. బెజ్జమహాదేవి ♦ బిడ్డగా నినుఁ బ్రేమఁ
బెంచుచుండఁగ నీవు ♦ పెరుఁగలేదె
గొడగూచి భక్తితో ♦ గోరపాలును బోయ
తప్పక నిత్యంబు ♦ త్రాగలేదె
బాణాసురుం డను ♦ భక్తునివాకిట
నండగా కావలి ♦ యుండలేదె
బోయ పుక్కిటనీరు ♦ బోసి మాంసం బిడ
నింపుగా నీవు భ♦క్షింపలేదె
అనఘ నీభక్తు లెటులఁ జే♦సినను నీకుఁ
హితవుగాని మనస్సున ♦ నేవగింప
వయ్య యిదియంత నీదయ ♦ యాత్మఁ దలఁప
ఈమనియగస్త్యలింగ బా ♦ లేందుసంగ. ౩౮

సీ. అంకోలసాలము ♦ నాత్మబీజావళి
సాధ్వి భర్తను లతా♦సంచయంబు
తరువును సింధుసం♦తతి సముద్రంబును
సూదంటురాయిని ♦ సూది యెట్లు
పొందునో యబ్బంగి ♦ పురహర నీచర
ణారవిందయుగంబు ♦ ననవరతము
చిత్తవృత్తియుఁ గూడి ♦ చెదరక యుండిన
ముఖ్యభక్తి యటండ్రు ♦ బుధులు పుడమి
నిట్టి సద్భక్తి నా కిచ్చి ♦ పట్టిపగిది
కనికరం బుంచి యిఁక జన్మ ♦ కలుగకుండఁ
జేయుమని నిన్ను వేడెద ♦ చిత్తమందు
నీమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౩౯

సీ. అనిశంబు పితృవన ♦ మందు వసించెడి
నీకు సౌధము లేల ♦ నీలకంఠ
అస్థులు దాలిచి ♦ యంతటఁ దిరిగెడి
నీకు స్నానములేల ♦ నిటలనయన
నెఱి దిగంబరుఁడవై ♦ నిచ్చలు ద్రిమ్మరు
నీకు వస్త్రము లేల ♦ నిగమఘోట
భస్మము మెయినిండ ♦ బాగుగాఁ బూసిన
నీకు గంధములేల ♦ సర్మలాంగ
సరసశవధూమధూపంబు ♦ చాలఁ గలుగ
వేరె ధూపంబు నీ కేల ♦ విసము దినిన
నీకు నైవేద్య మెందుకు ♦ నిక్కముగను
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౩౬

సీ. అభవ నీభూషణం ♦ బగు భుజంగము గణ
పతివాహనము మ్రింగ ♦ మతిఁ దలంచు
స్కందునితురగంబు ♦ సర్పహారంబుల
నశనంబు గొనఁజూచు ♦ నహరహంబు
నగజాతగుర్రంబు ♦ నాగాననంబును
గోళ్లఁ జీల్చుటకునై ♦ కోరుచుండు
గౌరి యసూయచే ♦ గంగతోఁ గలహించు
ఫాలాగ్ని చందురు ♦ బాధపెట్టు
ఎందుఁజూచిన వసలేమి ♦ నీకుటుంబ
కలహమున నీవు విసము ద్రా♦గంగవలనె
నేమొ కాకున్న విసము నీ ♦ కేల త్రావ
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౩౭

సీ. శిక్షితాసురకాండ ♦ దక్షనిధనశౌండ
నిర్జితసుమకాండ ♦ నిగమకాండ
రమ్యవృషభకాండ ♦ రక్షితబ్రహ్మాండ
మంగళగుణభాండ ♦ మథితచండ
కాండ విద్విట్కాండ ♦ గర్వవిఖండన
ఖండపరశు చంద్ర ♦ మండన భవ
భవపాశభూధర ♦ పాటనదంభోళి
భక్తకదంబహృ ♦ త్పద్మహేళి
గీ. కాండభూభవమాధవా ♦ ఖండలాది
దేవతామకుటాంచిత ♦ దివ్యరత్న
ఘటితపాదాబ్జయుగళ శ్రీ ♦ కంఠ భగణ
ఈమనియగస్త్యలింగ బా ♦ లేందుసంగ. ౩౭

సీ. భుజగసంచయహార ♦ పురదైత్యమార గ
జముఖాత్మజ వియత్క ♦ చధర భర్గ
కనకాద్రికోదండ ♦ కలితేందుఖండ మ
నసిజహరణ రమా ♦ నాథబాణ
శ్రితజాలపరిపాల ♦ శిక్షితకాల ధృ
తశతధృతికపాల ♦ తరణిశాల
నివసితకైలాస ♦ నిగమార్థభాస ర
విశశాంకశుచినేత్ర ♦ విమలగాత్ర
గీ. కమలకరవరానినుతపద ♦ కమలయుగళ
పాశనివహాఖండన శ్రిత ♦ పాకమనత
విదళన విలసత్కమనీయ ♦ వృషభవరతు
రగ విరించినుతా యంచు ♦ రక్షిఁ దలంతు
ఈమనియగస్త్యలింగ బా ♦ లేందుసంగ. [ద్విపదకందగర్భ] ౩౮

సీ. దైత్యేంద్రుఁడగు జలంధరుని శూలంబునఁ
బడఁబొడిచిన పోటుబంటవయ్య
అంబుధు లన్ని యేకార్ణవమై పార
నబ్బురంబుగ వటమైతివయ్య
నిత్యత నెఱుఁగక మృత్యువు నీపయి
గవిసినఁ గడ తేర్చు ఘనుఁడవయ్య
హరిపితామహులుఁ నిన్నరయ నహంకృతిఁ
జెందిన నీవు మిన్నందితయ్య
గీ. అట్టిబ్రహ్మాదులకుఁ జూడ నలవిగాని
నిన్ను దర్శింపనేర్తునే నిక్కముగను
నీమహత్త్వంబు చిత్రంబు నిగమఘోట
ఈమనియగస్త్యలింగ బాలేందుసంగ. ౪౦

సీ. ఆఱు మొగంబుల నలరారుశూరుని
కొమరుగాఁ గంటివి కూర్మి నడవ
ఆఱువర్ణంబుల నలరుమంత్ర మనెడి
యజ్ఞమందున భృంగ మైతివయ్య
ఆఱుపద్మంబుల నాఱు లింగంబులై
కడు ప్రకాశించిన ఘనుఁడవయ్య
ఆఱుస్థలంబుల కవ్వాలిస్థలమందు
జ్యోతిస్స్వరూపుండ వైతివయ్య
నీమహత్త్వంబుఁ దెలియక నీరజాస
నాదిదివిజులు వెఱగంద నవనియందుఁ
దెలియ నే నెంతవాఁడను దేవదేవ
ఈమనియగస్త్యలింగ బాలేందుసంగ. ౪౧

సీ. పెంచఁ దల్లి యగును ♦ పెనురోగములగమి
వారించుటకు ఘన ♦ వైద్యుఁ డగును
దుష్టసంతతిఁ గూడి ♦ దుష్టుఁడు గాకుండ
తప్పక శిక్షింపఁ ♦ దండ్రి యగును
శ్రీమంతుఁ గావింప ♦ సిరుల పెంపొనరింప
దాతయు నగు సత ♦ తంబు భువిని
సంసారమత్తేభ ♦ చండదర్ప మణంప
నురుప్రతాపోగ్రకే ♦ సరియు విపుల
దేహబంధలతాతతిఁ ♦ ద్రెంప దాత్రి
మఘవయోధరసముదయ ♦ హానసమారు
తంబు నీభక్తి యసియండ్రు ♦ తత్త్వవిదులు
ఈమని యగస్త్యలింగ బా ♦ లేందుసంగ. ౪౨

సీ. వరుసను ఱెక్కలు ♦ వచ్చుదనుకను తరు
కోటరాంతరమును ♦ గూడియుండు
విహగంబు కైవడి ♦ విస్తరంబగు భక్తి
ప్రభవించునంతకు ♦ ప్రబలమైన
యాజవంజవబంధ ♦ నాలయాంతర దేహ
మం దుండు దుఃఖముల్ ♦ బొందు జీవి
ఘనమైన నీభక్తి ♦ గలిగినపిమ్మట
భాస్కరుఁ డుదయింపఁ ♦ బావకోడు
గణనిశాపతి తేజంబు ♦ లణఁగురీతి
చటులమాయావికారాది ♦ సకలమంత్రి
దేవతాధ్యాన మణఁగును ♦ భావమందు
ఈమని యగస్త్యలింగ బా ♦ లేందుసంగ. ౪౩

సీ. సభలోన జనులంత • సంతసంబున జూడ
కైలాసమును జూపె • ఘనుఁ డొకండు
కడుపు చీలిచి యుండు • ఘనముగాఁ బూజించు
లింగంబుఁ జూపెను • లీల నొకఁడు
అందరు గనుగొని • యచ్చెరు వొంద జ్ఞా
నాగ్ని చేతను భస్మ • మయ్యె నొకఁడు
దొమ్మరివిడును • దొడ్డ్కాని యొక్కఁడు
కైలాసమున కేగె • ఘనత మీరఁ
దలఁప నిదియంత నీభక్తి • వలనఁ గాదె
భక్తిమాహాత్మ్య మింతని • పలుకవశమె
భక్తి గలిగినవారికి • ముక్తి గలుగు
ఈమనియగస్త్యలింగ బా • లేందుసంగ. ౪౪

సీ. జంతుజాలమునకు • జన్మ కల్గకమున్నె
యన్నంబుఁ బుట్టించె • నబ్జభవుఁడు
చూడుము రాతిలో • జూపట్టుకప్పకు
నాహార మొసఁగఁడె • యాదరమున
పొట్టకూటికి నెప్డు • పుడమిఱేఁడులఁ గూడి
సేవ జేయుదురయ్య • సిగ్గులేక
యిట్టివారల గాంచి • బిట్టగుక్రోధంబుఁ
బూనియుండు యముండు • మానసమున
వాని ఖండింప నీపాద • వనజములను
జేరి కొల్వంగజాల రీ • క్షితితలమున
భక్తి యొక్కటి గల్గిన • బాధలేదు
ఈమనియగస్త్యలింగ బా • లేందుసంగ. ౪౫

సీ. దురితమ్ము లన్నిటిఁ ◆ దొలఁగింప నీపూజ
యం దొకపుష్పార్ఘ్య◆మయిన చాలు
నని పల్కుచుండఁగ ◆ నారయ నీపాద
పూజాపరాయణుల్ ◆ పుడమిలోన
నేసరణిని నున్న ◆ నెందు సంశుద్ధులు
వారిదుర్గుణములు ◆ కోరి లెక్క
పెట్టువాఁడు గణింపఁ ◆ బెనుపాపకర్ముండు
వాని కెన్నఁటికిని ◆ వదల దఘము
గీ. మందరాద్రిని కైలాస◆మందిరమున
నుండ నాభక్తు లెచ్చట ◆ నుందు రచట
నుందు నని నివు తగఁ బల్కు◆చున్నకతన
నీమనియగస్త్యలింగ బా◆లేందుసంగ ౪౬

సీ. క్షితిని నీయాత్రలు ◆ సేవింపవలెనన్న
నీసర్వగత్వము ◆ బాసిపోవు
తవిలి నెమ్మది నిన్ను ◆ ధ్యానింపవలెనన్న
చేతఃపరత్వంబు ◆ చెడును నీకు
తోడరి ని న్నెప్పుడు ◆ స్తుతిజేయవలెనన్న
నీవాక్పరత్వంబు ◆ బోవునేమొ
తెలిసియుఁ దెలియక ◆ సలిపితి మూటిని
నరయఁగా నపరాధ ◆ మయ్యెనేమొ
గీ. నైన త్రివిధాపరాధంబు ◆ సడప నీవు
శక్తుఁడవుగావ నీకన్న ◆ శక్తుఁ డెవఁడు
దీని నీవ క్షమింపుము ◆ దేవదేవ
యీమనియగస్త్యలింగ బా◆లేందుసంగ ౪౭

సీ. ఎవ్వనిఫాలమం ♦ దిందుశేఖరుభక్త
పాదధూళిచయంబు ♦ బడినయంత
నతఁడు మోక్షంబున ♦ కర్హుం డనుచు నిలఁ
బండితు లెల్లను ♦ బల్కుచుండ
నట్టిసద్భక్తుల ♦ హస్తార్పితం బగు
భూతి ప్రేమను ఫాల♦మునను బూయు
వారిఫలంబును ♦ వాక్రువ్వ నేరికి
వశమగు విధికైన ♦ వశముగాదు
గీ. వారి కెంతయు నజ్జు ♦ వాక్చతురత
వాసవునివైభవంబును ♦ వనరుహాక్షు
సిరి తృణప్రాయ మవనిలో ♦ నరసిచూడ
నీమనియగస్త్యలింగ బాలేందుసంగ. ౪౮

సీ. నీవు నాకరమంద ♦ నిల్చియుండగ వేరె
పుణ్యస్థలము లంచుఁ ♦ బోవనేల
నీపాదతీర్థంబు నిత్యంబుఁ ♦ గలుగంగ
నన్యతీర్థంబుల ♦ కరుగనేల
నీప్రసాదము నేను ♦ నిత్యంబు సేవింప
నన్యప్రసాదంబు ♦ నరయనేల
నీదయ నాయందు ♦ నిరతంబుఁ గలుగఁగ
వేరెవేల్పులదయ ♦ వేడనేల
గీ. పద్మవనమును బొందిన ♦ బంభరంబు
జనునె యుగ్రవనంబును ♦ గనుగొనంగ
పిన్నవేల్పులఁ దలతునె ♦ నిన్ను వదలి
యీమనియగస్త్యలింగ బాలేందుసంగ. ౪౯

సీ. కాల నిర్జ దన్నినఁ • గరుణించితివి నీవు
కాలు మ్రొక్కిన నీకు • కరుణ లేదు
రాల రువ్విన నీకు • రాగంబు గల్గెను
పూలఁ బూజించిన • చాల దేమొ
రుచిఁ జూచి యర్పింప • రుచి యయ్యెనో నీకు
ముందు నీ కర్పింప • మురువు గాదో
ముసలంబుతోఁ గొట్ట • ముద మయ్యెనే నీకు
బుక్కగులాల్ గొట్ట • లెక్క లేదో
గీ. అట్టికార్యంబులను జేయ • నవనియందు
శక్తుఁడను గాను నిన్ను నే • శక్తికొలఁది
పూజఁ గావించెదను నన్నుఁ • బ్రోవ నీవె
ఈమనియగస్త్యలింగ బా • లేందుసంగ. ౫౦
సీ. శంకర భక్తవ • శంకర కలుషభ
యంకర కంకాళ • టంకహస్త
అస్తమితక్రూర • యాశ్రితమందార
భవపాశసంహార • భయవిదూర
మంగళకర సర్వ • మంగళాహృదయాబ్జ
భృంగ సద్భక్తహృ • త్సంగలింగ
అండజభుక్కాండ • శుండాలముఖవీర
భద్రాత్మజాభవ • భర్గ యీశ
గీ. భద్రవాహ గిరీశ కృ • పాసముద్ర
కాద్రివేయవరాంగద • రుద్ర వరద
దిగ్వసన శర్వ పురహార • దేవవంద్య
యీమనియగస్త్యలింగ బా • లేందుసంగ. ౫౧

సీ. ఎద్ది యనారతం ♦ బిందుశేఖరునామ
మవని పఠించునో ♦ యదియ జిహ్వ
వరగ నీశ్వరునిరూ♦పం బెవ్వి చూచునో
యవియ నేత్రంబు లీ♦యవనియందు
నేవి నిత్యం బల ♦ నిభచర్మచేలుని౯
గరము పూజించునో ♦ కరము లవియె
యెవ్వడు కలికంఠు ♦ నిచ్చ దలంచునో
సత్యంబుగా కృత♦కృత్యు డతఁడె
గీ. కాన జీతము బత్తెము ♦ లేనిబంట్ల
వగిది సర్వేంద్రియంబుల ♦ పనిఁగొనంగ
నిచ్చుటకు సార్థకం బేమ ♦ యెఱుఁగ రెవరు
నీమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౯౨
సీ. క్రతువు నశింప నా♦క్రతుకర్తలకు స్వర్గ
భోగాదిఫల మియ్యఁ ♦ బూని నీవు
జాగరూకుండవై ♦ శ్రద్ధతో నుంటివి
యంతంబు నొందిన ♦ యాగకర్మ
యిల శివారాధనం ♦ బింతయు లేకుండ
నెచ్చట ఫలియించు ♦ నేరికైనఁ
గాన లోకము యాగ♦కర్మఫలమునందు
మిన్నజమానతు ♦ గన్న నిన్నుఁ
గీ. గాంచి శ్రుతియందు విశ్వాస ♦ ముంచి కర్మ
లందు దృఢమైన యత్నంబుఁ ♦ బొందియుండె
దీన మీమాంసకమతంబు ♦ తెగించబడియె
నీమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౯౩

సీ. ప్రాణికోటులకెల్ల ♦ పతియు యాగక్రియా
చతురుఁడౌ దక్షుండు ♦ సవనకర్త
ఋషిసంచయమునకు ♦ ఋత్విజత్వంబును
సురలు సదస్యులై ♦ చూచుచుండ
క్రతుఫలం బియ్యంగ ♦ రతుఁడవై యుండిన
నీవలన మఘంబు ♦ నిధనమొందె
నది యుచితంబగు ♦ నవని శ్రద్ధాశూన్య
ముగఁ జేయువానికి ♦ మొనసి సవన

గీ. కృత్యములు నశియించును ♦ ధ్రువముగాను
భువిని నీభక్తి కలుగు మా♦నవుల కెందు
శుభము కల్గునుగాని యశుభము కలుగ
దీమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౯౮

సీ. ఒక్కకిరాతుండు ♦ పెక్కుమెకంబుల
నుక్కడంచుచు వచ్చి ♦ యొక్కచోట
రుద్రాక్షఁ గని దాని♦ ఛిద్రంబునను దార
మెక్కించి తనదాపు ♦ కుక్కమెడను
కట్టి యంతట వాఁడు ♦ కాలంబుసేసిన
యమకింకరులు వాని ♦ యమునికడకు
గొనిపోవవచ్చినఁ ♦ గినుక నీ కింకరుల్
చని వారి నదలించి ♦ వినఁడు వీఁడు

గీ. భువిని రుద్రాక్ష ముట్టిన ♦ పుణ్యశాలి
యనుచు నీచెంతఁ జేర్చిరి ♦ యద్భుతముగ
దీనిమహిమను దెలియంగ ♦ దేవ నీవె
యీమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౯౯

సీ. ఒకపాపకర్ముండు ♦ సకలరోగంబుల
పీడితుం డగుచుఁ దా ♦ పిదప నక్క
డక్కడ చని చని ♦ యొక్కశ్మశానంబు
పజ్జ నడవలేక ♦ పడిన నొక్క
శునక మచ్చటి పిత్రు♦వనభస్మకలితాంఘ్రి
యై వానియంగంబు♦నందు ద్రొక్క
నంత వాఁడు మడియ ♦ యమకింకరులు వానిఁ
గొనిపోయి వడి శమ♦నునికిఁ దెల్ప
గీ. నతఁడు వానియుదంతంబు ♦ నంతఁ దెలిసి
భయమునను నీదుచెంతకుఁ ♦ బంపె నహహా!
భూతిమాహాత్మ్య మింతని ♦ పొగడ వశమె
ఈమునియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౯౬

సీ. పార్వతీవల్లభ ♦ పంచాననంబులఁ
బంచాక్షరంబులు ♦ ప్రభవమొందె
నవి యైదు గూడి పం♦చాక్షరం బనఁదగె
నది మంత్రమాత్రయై ♦ యలరె భువిని
ఆమంత్రమును బ్రణ♦వాక్షరయుక్తంబు
గాఁ జేయఁగా షడ♦క్షరియు నయ్యె
ననయంబు నామంత్ర♦మును జపియించిన
మనుజుండు నీవెపో ♦ స్మరవిదారి
గీ. అట్టిమనుజుని నరుఁడని ♦ యనఁగఁదగునె
ఇంచుకైనను సంశయం ♦ బుంచవలదు
ఇదియు సత్యంబు సత్యంబు ♦ మదిఁ దలంప
ఈమునియగస్త్యలింగ బా♦లేందుసంగ ౯౭

సీ. సకలసౌభాగ్యముల్ ♦ సంపూర్ణముగ నిచ్చు
భవము లణంచు పా♦పముల ద్రుంచు
నిట్టి భక్తిని జడుం ♦ డిలను ద్యజించును
నిఖలదైవతమాన♦నీయ మైన
హైయంగవీనంబు ♦ నవని గుక్కకుం బెట్టు
దిననోపునే మూతి ♦ ద్రిప్పుగాని
నిర్హేతుకంబగు ♦ నీకటాక్షము గల్గ
సత్కర్మ నొనరింప ♦ శ్రద్ధ గల్గు
గీ. కర్మచే చిత్తశుద్ధియుఁ ♦ గల్గు చిత్త
శుద్ధిచే భక్తి గల్గు ప్ర♦సిద్ధమైన
భక్తిచే జ్ఞానమును దాన♦ముక్తి కలుగు
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ ౫౭

సీ. మున్నుసహస్రాబ్జ♦ముల హరి బూజింప
నొక్కపద్మం బందు ♦ దక్కువైన
నక్షిపద్మంబు నీ♦యంఘ్రిని బూజింప
మెచ్చి చక్రాయుధం ♦ బిచ్చినావు
వందికోలకు మున్ను ♦ పార్థుండు నీమస్త
కంబునఁ గొట్టఁగాఁ ♦ గరుణతోడ
భక్తుఁ డనుచు వాని ♦ పౌరుషంబును గని
మెచ్చి నీయస్త్రంబు ♦ నిచ్చినావు
గీ. భక్తుఁ డెద్దియుఁ జేసిన ♦ బాంధవుండు
భక్తుఁ డన నీకు ప్రాణంబు ♦ భక్తవరద
భక్తి యొక్కటి యున్నను ♦ బాధ లేదు
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౫౮

సీ. అంచితంబైననీ ♦ మంచిగుణంబుల
నెంచి కాంచి నుతింప ♦ నేరితరము
సంచితంబులను మా ♦ యించి పాపంబుల
దుంచి భవలతలఁ ♦ ద్రెంచ నీవె
మించి పాదపుగాను ♦ పెంచిన నీరూపుఁ
గాంచలేరైరి వి♦రించి హరియు
తొడరి బ్రహ్మాదుల ♦ స్తుతియు నీమొదలను
కుంఠితంబగుసన్న ♦ కువలయమున
గీ. నస్మదాదులస్తుతి వేఱ ♦ యరయ నేల
శక్తికొలఁదిని స్తుతియించి ♦ భక్తి మీర
నీపురంబును జేరరే ♦ నిక్కముగను
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౬౦

సీ. సాంబ కల్పితగిరి♦శంబ యంబరకేశ
తుంబురుముఖసత్క♦దంబవినుత
పింగాంశుఘనజటా♦సంగ వియన్నదీ
భంగశీకరయుగ్వ♦రాంగ లింగ
అండజపరివృఢో♦ద్దండ సుంకీశబాహు
దండ జగద్భిత్తి♦ చండశౌండ
భిల్లవేషధర ప్రి♦ఫుల్లహృత్కమల ప
శ్వల్లలాట మహేశ ♦ శాంకరీశ
గీ. ఈశ భవనాశ కలుషవి♦నాశ గిరిశ
కాశసంభవజనక భూ♦తేశ సుప్రి
కాశ వననీకృతాశాకీ♦నాశనాశ
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ ౬౧

సీ. దశకంధరుఁడు మున్ను ♦ దర్పంబుచేత నీ
కైలాసగిరి యెత్తఁ ♦ గాంచి వేగ
నాతని నీచరణాం♦గుష్ఠమున ద్రొక్కి
నణఁగి కేల్మోడ్చి వాఁ ♦ డద్భుతముగ
వేదసూక్తుల నిన్ను ♦ వినుతింపఁ గ్రిమ్మర
కరుణించి ప్రోచివె ♦ గర్వ ముడిపి
నీనిగ్రహంబున ♦ నీరజాసనహరి
యమనుమబాణులు ♦ హతులు గారె
గీ. నీవు కను విచ్చి చూచుట ♦ నిఖిలసృష్టి
నీకు దయ గల్గుటయె సర్వ♦లోకవృద్ధి
నీవు కను మూయఁ బ్రళయంబు ♦ నిక్క మిదియ
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౬౨

సీ. కరచరణంబులఁ ♦ గావించినదికాని
వాక్కాయములవల్ల ♦ వచ్చుదాని
శ్రవణంబునను గాని ♦ చక్షువునను గాని
సంభవించినదియు ♦ సతము మాన
సమువల్లనైనను ♦ సంభవ మొందిన
యపరాధము విహిత ♦ మవిహితంబు
నైనదికాని నీ ♦ వరసి క్షమింపుము
క్షమియింపకున్నను ♦ శక్తు లెవరు
గీ. నమ్ము దాసరితప్పు దండ♦మ్ముతోను
సరి యనుచుఁ బల్కులోకోక్తి ♦ సరణి వినవె
దండ మొక్కటి పెట్టెనఁ ♦ దప్పు లేదు
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౬3

సీ. మంగళాత్మక సర్వ◆మంగళార్చితలస
దర్ధాంగ నతహృత్క◆యాబ్జభృంగ
ప్రళయకాలానల◆భసితవిలిప్తాంగ
డమరుగరవధూత◆కమలజాండ
సామగానవిలోల ◆ సద్భక్తపరిపాల
పావకదృక్ఫాల ◆ భవ్యశీల
కామితఫలదాత ◆ గణకదంబసమేత
లీల ధృతవిధిక◆పాలజాల
భూజలానలవాయు◆భోమృగాంక
భాస్కరాత్మస్వరూప చి◆ద్భాసమాన
శ్రుతిశిఖాజాలనతిపాత్ర ◆ శుభ్రగాత్ర
ఈమనియగస్త్యలింగ బా◆లేందుసంగ. ౬౪

సీ. పారంబు లేని సం◆సారాబ్ధిఁ బడు నరు
నకు నీదు నామంబు ◆ నావ గాదె
ఘనమైన కామాంధ◆కార మణంపఁగ
నీ నామ మర్కస◆న్నిభముగాదె
బహుళశోకానల◆ప్రజ్వని బరిమార్ప
నీనామ మిల జడి◆వానగాదె
లోభలతావళి ◆ లూనంబుఁ జేయ నీ
నామంబు దాత్రి మ◆నంగఁదగదె
మోహపవమానలేపస◆మూహనకులి
మదమతంగజకేసరి ◆ మాత్సరత్వ
జలదఝంఝానిలము గాదె ◆ తెలియఁజాల
నీమనియగస్త్యలింగ బా◆లేందుసంగ. ౬౫

సీ. గోనాయకనుత ర♦మానాయకసఖ శి
వానాయక గిరీశ ♦ వామదేవ
గోనాయకపతాక ♦ సన్నాయకకలాప
శ్రీనాయకాశుగ ♦ క్షితిశతాంగ
ధ్యేయాచలా భవా♦మేయస్వరూపాప్ర
మేయామరార్చిత ♦ మృత్యుదమన
కాయజాంతక మాని♦గేయ భూతివిలిప్త
కాయ స్వాశ్రితసుఖ♦దాయకేశ
గీ. నీలకంఠ భవవ్యాళ♦నీలకంఠ
బాహులేయసుతాధ్వ♦బాహులేయ
దక్షమఖశిక్ష కరుణాక♦టాక్షదక్ష
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౬౬

సీ. ఆత్మ నీవు ధరాధ♦రాత్మజ మతి ప్రాణ
తతి పరిచారక♦వితతి నీకు
నీవు కాపురముండ ♦ నెలవు నా దేహంబు
పూజయే వివిధోప♦భోగరచన
నిద్ర సమాధి నా♦నిఖిలసంచారంబు
నీ ప్రదక్షిణమగు ♦ సిటలనయన
సుతులు నా సకలవా♦క్కృతులు నేయేకర్మ
లాచరింప నవియెల్ల ♦ నుచితమైన
గీ. నీసమర్చనమగు దేవ ♦ నేన యుండ
వేరెనైవేద్యమునకయి ♦ వెదకనేల?
మదిని నమ్మినవారల ♦ కిదియ చాలు
నీమని యగస్త్యలింగ బా♦లేందుసంగ. ౬౭

సీ. జన్మంబు గోరక ♦ జననపరంపర
లెవఁడు దుంచునొ వాఁడె ♦ యిల ఘనుండు
తనవారు పెరవార ♦ లను భేదమును లేక
తిరుగుచుండెడివాఁడె ♦ దేవుఁ డవని
దృశ్య మంతయు లింగ♦దృష్టితో నుండిన
వాఁడె మహేశుండు ♦ వసుధలోన
ఎదుట లింగముఁ గని ♦ హృదయమందున వేఱ
కనఁబోనివాఁడె స♦జ్జననుతుండు
గీ. చూచువాఁ డంతటను నిండి ♦ చూడఁదగిన
వస్తు వొక్కటియైయుండ ♦ వాంఛ లేల?
గురుకటాక్షంబు గల్గిన ♦ కోర్కు లడఁగు
నీమనియంగ స్వలింగ శా♦లేంద్ర సంగ. ౬౮

సీ. మున్ను పింగళుఁడను ♦ మూఢుండు నీప్రసా
దంబున సమ్మృతప♦దంబు జెందె
వామనుఁడను ద్విజ♦వరుఁడు గురుప్రసా
దంబున మోక్షప♦దంబు నొందె
బిల్లమరాయండు ♦ ప్రీతి గురుప్రసా
దంబున నిశ్శ్రేయ♦సంబు నొందె
మున్ను కృష్ణుండు స♦న్మునిభుక్తశేషంబుఁ
గొని వజ్రకాయంబు♦నను జెలంగె
గీ. అమృతమును గ్రోలి నిర్జరు ♦ లైరికాని
దేవతలు, నీవు కారైరి ♦ దివ్యమైన
యీ ప్రసాదంబునను భక్తుఁ ♦ డీవ యగును
ఈమనియగ స్వలింగ బా♦లేందుసంగ. ౬౯

సీ. సతతంబు జనులు సం♦సారంబుఁ గనుఁగొని
యింద్రజాలం బని ♦ యెంచలేరు
అధికమౌ సిరిఁ జూచి ♦ యశ్వత్థపర్ణాగ్ర
జలబిందునిభమని ♦ తలఁచలేరు
జాతి నెంచక భక్త♦జాలంబుఁ గనుఁగొని
నీరూప మని బుద్ధి ♦ నిలుపలేరు
కర్మసంచయమును ♦ గనుఁగొని నెమ్మది
ముక్తిసాధన మని ♦ మురియుచుంద్రు
గీ. నీదుభక్తుల కెల్లను ♦ నిజము తెలియు
భక్తిహీనులు మాయను ♦ బడుదు రెందు
మాయ నంటనివాఁడె యీ♦మాధవుండు
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౭౦

సీ. వేధాదిదీక్షల ♦ విధిపూర్వకంబుగా
నొనరించి భక్తి చే♦కొనఁగఁ జేసి
ఆణవాదిమలత్రి♦యంబును బోకార్చి
నీవు లింగం బని ♦ తావు దెల్పి
మాంసపిండంబును ♦ మంత్రపిండంబుగాఁ
జేసి యఘలతలఁ ♦ గోసివేసి
అంగంబు లింగం బ♦సంగ భేద మొకింత
యైనను లేకుండ ♦ నలరఁ జేసి
గీ. లింగమందున ప్రాణంబు ♦ సంగతంబు
గా నొనర్చి రహస్యంబు ♦ కరుణఁ జెప్పి
నిజముఁ దెల్పినగురుఁడవు ♦ నీవె కావె
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౭౧

సీ. దిక్కు నీ వనియుంటి ♦ తిరముగా మ్రొక్కుంటి
వేరవేల్పుల నేను ♦ వేడనంటి
నిచ్చలు వేఁగంటి ♦ నెలవు నే వలదంటి
చక్క.గా నీదయ ♦ చాలునంటి
నీవంటిదైవరిబు ♦ గావ లేఁడని వింటి
కడగంటిమాపులఁ ♦ గావుమంటి
తొంటిపుట్టువుకొల ♦ లైంటి యీదోసఁగుల
చంటిఁవాడని చూడ ♦ కుంట మంచి
గీ. దంట మొండైనచుట్టంబ ♦ వంటి దైవ
మంటి తలిదండ్రిలును నీవ ♦ యంటి మొక్కు
చుంటి నే కొన కేమన ♦ కుంటి నిప్పు
డీమనియగస్త్యలింగ బా ♦ లేందుసంగ. 22

సీ. నీకు క్రొమ్ముడి మిన్న ♦ నిప్పు నుదుటికన్న
కురువునందున ఎన్న ♦ కుతుకనిండ
చిలువసొమ్ములచెన్న ♦ నెలవు జగముకన్న
కన్నకప్పు నీ కిచ్చె ♦ కన్న మున్న
వన్నగా నిచ్చలు ♦ సన్నుతించెద నిన్న
నీవు తప్పించక ♦ పోవు నన్న
కన్న మూసిన మాయ ♦ కున్నను నిన్నద
తన్ను మరచి పొడఁ ♦ గన్న మనుజుఁ
గీ. డన్నగా నీవ యగుఁ గాక ♦ కన్నతండ్రి
నిన్నుఁ గనుగొనుమార్గంబు ♦ నేర్పి మంచి
తెరువుఁ జూపించఁగలయట్టి ♦ గురుఁడ వీవె
ఈమనియగస్త్యలింగ బా ♦ లేందుసంగ. 23

సీ. గంగ తలను సర్వ♦మంగళ కురువున
                నంగజభసితంబు ♦ నంగమందు
    తలయందునను చంద్ర♦కళయుం బ్రకాశింప
                నహివరుల్ హారము♦లై చెలంగ
    ఆర్ద్రనాగాజిన ♦ మంగంబునందున
                చక్రనిశాలువై ♦ జానుమీర
    నందియు భృంగియు ♦ నందడిం దొలగింప
                వేత్రపాణులు నయి ♦ వెలయుచుండ
    గీ. పాకశాసనముఖసుర♦పరిజనంబు
        సతతమును గొల్వ మునివరుల్ ♦ నుతులొనర్ప
        వెండికొండను బ్రభుండవై ♦ వెలసినావు
        ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౭౪

సీ. మించినవిధితలం ♦ దుంచెను నిగోరు
                నెఱిపాపము లడంచు ♦ నీదుపేరు
    పున్నమచందురుం ♦ బురుడించు నీసొరు
                పుడమితాలుపు నీకు ♦ మెడను బేరు
    జడలలో వెలుగొందు ♦ చక్కనిమిన్నేరు
                అక్షిచేం గూల్చితి ♦ హారికుమారు
    రజతభూధరముపై ♦ రాజిల్లు నీయూరు
                పురహార నీ కయ్య ♦ పుడమిపేరు
    గీ. ధీరుం బ్రోచిన యది యూరు♦పేరు గాదు
        కాన దీనుని నన్నుం బ్రోవు ♦ కరుణమీఱ
        నూరకుండెద వేమారు ♦ కోర నీకను
        ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౭౫

సీ. కొండరాళ్లఁ జరించు ♦ దండభృద్భటోత్కర
వాటంబు దాడింప ♦ మేటిదైన
యజ్ఞాన మనియెడి ♦ యంధకార మడంప
మ్రొక్కెడిపురుహూత♦ముఖ్యదేవ
గణమకుటాంచిత♦మణులారయఁగఁ గందెఁ
దలిరుటాకుల నొంచు ♦ తావకీన
పాదపద్మంబులు ♦ నాదుహృన్మణిమయ
పాదుకాతలమున ♦ నాదరమున
గీ. నూన నంగీకరింపుమీ ♦ నేను పాద
సేవఁజేసెద నెప్పుడు ♦ భావమందు
వేరె తలఁపక రావయ్య ♦ వేదవేద్య
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౭౬

సీ. సనకాదిమునులైనఁ ♦ గనలేరు నీగట్టు
నిఖిలభక్తులయందు ♦ నీదుపట్టు
ధనువుగాఁ జేతిలోఁ ♦ దాల్చితి పొంగట్టు
పాపంబు లెల్లను ♦ బాయనెట్టు
జముఁ డిటు రాకుండఁ ♦ జయ్యనఁ బడఁగొట్టుఁ
నామది నీయందు ♦ నాగబట్టు
పిట్టవ్వమును నీకుఁ ♦ బెట్టె కొంచెము బిట్టు
వివిధాశ్రితుల కీవు ♦ వేల్పుచెట్టు
గీ. వహవా నీయంతవేలుపె ♦ యవనిచుట్టు
పట్టుఁ గనుగొన నుండిన ♦ నొట్టుపెట్టు
గట్టురాచూలితోడఁడ న♦న్నిట్టు ప్రోవు
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౭౭

సీ. కైలాసమున నుండఁ ♦ గల్పించితివి బస్తి
కవ్వడితో నీకుఁ ♦ గల్గె కుస్తి
ధనదునితో నీకుఁ ♦ దనరారు బల్ దోస్తి
జడునకు నిను గొల్వఁ ♦ గడఁగు సుస్తి
త్రిజగంబులందున ♦ తిరుగుచుందువు గస్తి
యిలలోన నీకన్న ♦ నెవరు జాస్తి
నీనామ మఘనిశా♦నికరారుణగభస్తి
వదలక ప్రజకుఁ జే♦యుదువు స్వస్తి
గీ. నీజగత్త్రయమందున ♦ నీవ ప్రశస్తి
ప్రబలె మా కందఱకు నీవు ♦ బాపు కస్తి
నిఖలభక్తుల కెల్లను ♦ నీవె యాస్తి
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౭౮

సీ. దివమునందున నిన్నుఁ ♦ దివిరి పూజించుట
యుక్తంబు కాదండ్రు ♦ యోగివరులు
నిశివేళయందున ♦ నిన్నుఁ బూజించుట
తగదని యందురు ♦ తత్త్వవిదులు
మది దివారాత్రులు ♦ వదలి నిన్నెప్పుడు
పూజింపవలెనండ్రు ♦ బుధులు భువిని
ఇత్తెఱంగున నిన్ను ♦ నెవఁడు పూజింపంగ
గలఁడు నీ భక్తుఁడౌ♦కఁడు దక్క
గీ. నీరహస్యంబుఁ దెల్పంగ ♦ నెవరు కలరు
నీవు గురురూపమును దాల్చి ♦ నిజముఁ దెల్పి
కావుమని నిన్ను వేడెద ♦ గరళకంఠ
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౭౯

సీ. దానకాలం బిదె ♦ దానపాత్రుఁడ నేను
దాతవు నీవయ్య ♦ ధరణియందు
నీవు దాత వటంచు ♦ నీవల్ల నన్యంబు
నే వేఁడ నయ్య యో ♦ నీలకంఠ
సర్వకాలంబు నా♦స్వాంతంబు నీపద
నీరజమందున ♦ నిల్చునటుల
స్థిరమైనభక్తి యా♦చించెద నాకొర
కిమ్ము చాలును మరి ♦ యేమివలదు
గీ. దానధర్మ్యండ నయ్యెద ♦ తథ్యముగను
వేరె కైవల్య మన నెద్ది ♦ విడువ కెపుడు
నిన్నుఁ జూచుచు నీచెంత ♦ నిల్చు టదియె
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౯౦

సీ. మొలను వస్త్రము లేక ♦ ముప్పన్నె మెకముతో
లుపట్టంబుగా నీవు ♦ గట్టినావు
పైన వస్త్రము లేక ♦ పచ్చియేనుఁగుతోలు
కప్పుకొంటివి నీవు ♦ కమలపాణి
అశన మబ్బక నీవు ♦ హాలహాలంబును
కుత్తుకబంటిగాఁ ♦ గుడిచినావు
సొమ్ములు లేక స♦ర్పమ్ములఁ దాల్చితి
వెక్క గుర్రము లేక ♦ యెద్దు దొరకె
గీ. ఉండుటకు నిల్లు లేక యా♦రూర నిలిచి
పరులచే నుపహారముల్ ♦ పడసితీవు
శ్రుతిని భక్తుల నెల్లు పో♦షింపఁగలవొ
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౯౧

సీ. నిను పురుషుం డని ♦ నిక్కముగా నన
లేను స్త్రీత్వము నీవు ♦ పూనుకతన
పడఁతివి నీవని ♦ నుడువుడ మన్నను
పురుష భావ మొకింత ♦ పూనినావు
షండుఁడ వని యనఁ ♦ జాలను దారుకా
వనమున పత్నుల ♦ వలచినావు
ఈమువ్వురనుగాక ♦ యెవ్వరు గనలేని
వస్తు వీవని యందురు ♦ వసుధ బుధులు
గీ. ఎవ్వరికిఁ గానకున్న నే ♦ నెట్లు గాంతుఁ
గనుఁగొనక నిన్ను పూజింపఁ ♦ గడగు టెట్లు
పూజ్యపూజకపూజలు ♦ పోయె నయ్య
ఈమనియగస్త్యలింగ బా ♦ లేందుసంగ. ౮౧

సీ. పెండ్లికాలంబున ♦ పెద్ద లందరు గూడి
ప్రవరఁ జెప్పు మటంచుఁ ♦ బల్కునపుడు
దానికి తగినయు ♦ త్తర మియ్య లేకయు
మౌనవ్రతంబును ♦ బూనినావు
అత్తమామలు దాని ♦ నరయక యే నీకు
పిల్ల నెట్లిచ్చిరో ♦ ప్రేమమీర
కులగోత్రములను లో ♦ కులు విచారింపక
సంబంధమున కెట్లు ♦ సమ్మతింతు
రవని వడ్డించువాఁ ♦ డాప్తుఁ డైన బంతి
కొనను గూర్చున్న వానికి ♦ కొరతలేదు
గౌరి నినుఁ గోర తక్కిన ♦ వారి దేమి?
ఈమనియగస్త్యలింగ బా ♦ లేందుసంగ. ౮౨

సీ. నీకన్న నధికుఁడు ♦ నిక్కముగా నున్న
నిల మహాదేవుఁడ ♦ వెట్లు లగుదు
వంతకుఁ గూల్చిన ♦ యధికుఁడుండిన నంత
కాంతకుఁడవు నెటు ♦ లగుదు వీవు
మృత్యువుఁ బరిమార్చు ♦ మేటి యుండిన నీవు
మృత్యుంజయుండవై ♦ మెలఁగు టెట్లు
అష్టమూర్త్యాత్మకుఁ ♦ డన్యుఁ డుండిన నీవు
నష్టమూర్త్యాత్మకుం ♦ డగుదు వెట్లు
ఇట్టి నామంబు లరయంగ ♦ నెలమి నీకుఁ
దక్క మరి యెవ్వరికి లేవు ♦ దక్షసవన
శిక్ష వందారుపాలన♦దక్ష భర్గ
ఈమునియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౮౪

సీ. వెండికొండను ♦ లెస్సఁ బండినవాఁడవు
పసిడికొండను కేలఁ ♦ బట్టినావు
అన్నపూర్ణభవాని ♦ యఖిలభక్తుల కన్న
దానంబుఁ జేయుచు ♦ దండ నుండ
నవనిధుల్ గల్గిన ♦ నరవాహనుఁడు చెంతి
సఖుఁడయి నీయాజ్ఞ ♦ నలుపుచుండ
కామధేనువు కల్ప♦కంబు చింతామణి
గల పురందరుఁ డెప్డు ♦ కొలుచుచుండ
ఆదిభిక్షుకుఁ డీశ్వరుఁ ♦ డనుచు నిఖిల
జనులు పల్కెదరయ్య లఁ♦జ్జయును లేక
నిల సుజను లెట్లు వింద్రురో ♦ యింపుతోడ
ఈమునియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౮౫

సీ. త్రివిరి దైత్యునికోర్కెఁ • దీర్చుటకై నీవు
గజచర్మమును మేనఁ • గప్పినావు
బ్రహ్మాధిపతియును • భావంబు ప్రకటింపఁ
దత్కపాలంబులు • దాల్చినావు
దుష్టశిక్షణపటు • దోర్బలం బెఱిఁగింప
వాడిశూలము కేలఁ • బట్టినావు
పశుపతి యనుపేరు • ప్రజ లెఱుంగుటకయి
పశువాహనంబును • బడసినావు
విష్ణువల్లభుఁ డనుపేరు • విదితమగుట
కతని కర్ధాంగ మిడలేదె • యువనిజనుల
కాంతుఁ డీర్ష్యంగ నీకన్న • ఘనుఁడు లేఁడు
ఈమనియగస్త్యలింగ బా • లేందుసంగ. ౮౬

సీ. ఒకవంక ప్రమథౌఘ • మకలంకకైవాగ
మంబులఁ బ్రతిపాద • నంబుఁ జేయ
ఒకయొక్క మునివర్య • నికురుంబ మశ్రాంత
మలఘు వేదాంతార్థ • ములు వచింప
ఒకచెంత కిన్నర • ప్రవరంబు నీశ్వర
స్తవమయగానంబు • సల్పుచుండ
ఒకమన్కి నర్చనో • త్సుకనిర్జరౌఘముల్
నమ్రులై సాష్టాంగ • నతు లొనర్ప
గీ. రజతగిరిసౌధమధ్యస్థ • రత్నఖచిత
హైమపీఠస్థచారువ్యా • ఘ్రాజినమున
తుహినధరకన్యతో నుండు • దొరవు నీవె
ఈమనియగస్త్యలింగ బా • లేందుసంగ. ౮౭

సీ. భూరిగాయత్రివి♦భుండవై తనరుట
శ్రుతిసుతానాథపూ♦జితుఁడ వగుట
కైలాసయాత్రను ♦ గావించు శౌరికి
వరసుతు నొసఁగిన♦వాఁడ వగుట
నేత్రంబుతో వేయి♦నీరజంబులచేత
పుండరీకాక్షుచేఁ ♦ బూజఁగొనుట
శౌరిభక్తికి మెచ్చి ♦ చక్రంబు నొసఁగిన
యధిక తేజశ్శాలి ♦ వగుట నిన్ను
గీ. సర్వదేవప్రకృష్టుండు ♦ శాశ్వతుండు
పశుపతి యటంచు పండితుల్ ♦ పల్కుదు రిల
అఖిలకల్మషభంగ భ♦క్తావనంగ
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౮౮

సీ. ఫాలనేత్రాగ్నిచే ♦ పంచశిలీముఖు
ధ్వంసం బొనర్చిన♦వాఁడ వగుట
విషమును గని దేవ♦వితతి భీతిల్లగా
గళమునఁ దాల్చిన ♦ ఘనుఁడ వగుట
కాలునిగర్వాంధ♦కారం బణంపఁగ
నీరజబంధుస♦న్నిభుఁడ వగుట
త్రిపురంబులను గూల్చి ♦ తేజరిల్లుటచేత
దక్షువితానవి♦దారి వగుట
గీ. వాసవికి స్వాస్త్ర మిచ్చిన♦వాఁడ వగుట
చారుతరమోహినీరూప♦ధారివైన
దనుజరిపునందు శాస్తను ♦ గనినవాఁడ
వగుట దేవ! ప్రకృష్టుఁడ ♦ వైతివయ్య
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౮౯

సీ. క్ష్మాతలంబున సర్వ♦జననికరంబుచే
నర్చింపఁబడువాఁడ ♦ వగుటచేత
వీరికి నెప్పుడు ♦ వివిధసంపద లిచ్చి
ప్రోవంగఁజాలిన ♦ ప్రోడ వగుట
నరహరిమూర్తియై ♦ నలినాక్షుచేత న
ఖండభక్తిని బూజి♦తుండ వగుట
హంసవరాహంబు ♦ లై విధివిధుల క
దృష్టశీర్షాంఘ్రిస♦౦స్థితిని దెలుప
గీ. జననమరణంబులును లేని ♦ ఘనుఁడ వగుట
సర్వదేవప్రకృష్టుండు ♦ శాశ్వతుండు
పశుపతి యటంచు నిను బుధుల్ ♦ పల్కుదు రిల
ఈమనియగస్త్యలింగ భా♦లేందుసంగ. ౯౦

సీ. వారణాసీక్షేత్ర♦వ్యాసభుజస్తంభ
నాత్యర్థదక్షుండ ♦ వగుటచేత
పురనాశమున వృష♦భుం డగు హరిచేత
భూమిఁ దాల్పించిన ♦ ప్రోడ వగుట
కమలాసనశిరోస్థి♦కల్పితమాలాజాల
భరితవక్షఃస్థల♦భాసి వగుట
నిను భజియించిన ♦ జనులకు జ్ఞానము
క్తుల నొసంగుటకు శ♦క్తుండ వగుట
గీ. సర్వదేవప్రకృష్టుండు ♦ శాశ్వతుండు
పశుపతి యటంచు నిను బుధుల్ ♦ పల్కుదు రిలఁ
గాన నీకన్న ఘనుని నేఁ ♦ గాన నెందు
ఈమనియగస్త్యలింగ భా♦లేందుసంగ. ౯౧

సీ. ఆధారచక్రంబు♦నందు నాలుగు రేకు
లందు వశషస లు ♦ నలరుచుండు
కుంకుమవర్ణంబు ♦ కింకిణీనాదంబు
పృథివి భూతంబును ♦ ప్రథితమగు క్రి
యాశక్తి యర్ధచం♦ద్రాకార మచ్చట
సేద్యభక్తియును గణే♦శ్వరుఁడు దైవ
మార్నూరు హంసలు ♦ నాడు నకారంబు
బీజంబు గణపతి♦పూజ సల్పి
గీ. భూతనియనుగ్రహముఁ జెంది ♦ యవలనున్న
విమలమైనట్టి స్వాధిష్ఠ♦కమలమందుఁ
జేరఁబోవుదురయ్యా సీ♦సేవకు లిల
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౯౨

సీ. సరస స్వాధిష్ఠాఖ్యచ♦క్రంబునం దారు
దళముల బభమయ♦రలలు చెలఁగు
అప్పు భూతము త్రికో♦ణాకారమై యుండు
నట జ్ఞానశక్తియు ♦ నమరియుండు
వీణారవంబును ♦ విద్యుత్ప్రకాశంబు
నమలనైష్ఠికభక్తి ♦ యారువేలు
హంస లాడుచు నుండు ♦ నట మకారము బీజ
మబ్జజుఁ డధిపతి ♦ యతని శ్రద్ధ
గీ. మానసంబునఁ బూజించి ♦ వానిదయను
గాంచి యవ్వల మణిపూర♦కంబునందుఁ
జేరఁబోవుదు రయ్యా సీ ♦ సేవకు లిల
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౯౩

సీ. మంగళకరమగు ♦ మణిపూరకంబున
దళములు పదియున్నై ♦ తనరుచుండు
డాదిఫాంతంబగు ♦ నక్షరసమితియు
నార్వేలుహంసలు ♦ నాడుచుండు
అగ్నిభూతమునందు ♦ నవధానభక్తియు
శ్యామలవర్ణ మిం♦చ్ఛ యను శక్తి
వేణునాదంబు ఘం♦టాక్వాణంబును రికార
బీజంబు విష్ణువు ♦ వేలు పతని
గీ. మానసికపూజఁ గావించి ♦ వానికృపను
బొంది యవల ననాహత♦మందు వేగఁ
జేరఁ♦బోవుదురయ్య నీ♦సేవకు లిల
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౯౪

సీ. సరస ననాహత♦చక్రంబునను గూడి
ద్వాదశదళములు ♦ దనరుచుండు
కాదిఠాంతంబు లం♦క్షరములు నచ్చట
శ్వసనభూతం బాది♦శక్తి యుండు
కాంచనవర్ణంబు ♦ కడుశంఖనాదంబు
నార్వేలు హంసలు ♦ నాడుచుండు
నట వర్తులాకార ♦ మనుభవభక్తియు
వాకారబీజంబు ♦ వరలుచుండు
గీ. రుద్రుఁ డధిపతి యతని ని♦ర్నిద్రుఁ డగుచు
మానసార్చన మొనరించి ♦ వానిదయను
బొంది యవల విశుద్ధంబు♦నందు వేగఁ
జేరఁబోవుదురయ్య నీ♦సేవకు లిల
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౯౫

సీ. శుద్ధమైనట్టి వి♦శుద్ధచక్రమునందు
షోడశదళములు ♦ జూడనొప్పు
నందు స్వరంబులు ♦ నాకాశభూతంబు
స్ఫటికవర్ణము ♦ పరాశక్తి యుండు
నానందభక్తియు ♦ నట మేఘనాదంబు
హంసలు పదినూఱుల ♦ నాడుచుండు
నట యకారము బీజ ♦ మధిపతి యీశ్వరుం
డనయంబు హృదయము ♦ దమలభక్తి
గీ. అతని బూజించి తదనుగ్ర♦హంబు నొంది
పైన నాజ్ఞేయ మను మహా♦పద్మమందుఁ
జేరఁబోవుదురయ్య నీ♦సేవకులిల
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౯౬

సీ. నేత్రయుగ్మముమధ్య ♦ నిర్మలం బైనట్టి
యాజ్ఞేయ మను చక్ర ♦ మలరుచుండు
హం క్షంబు లరిరెండు ♦ నక్షరద్వయ ముండు
నభినాదము మోర్రియు ♦ నధిక మగు మ
హాతత్త్వభూతంబు ♦ నమరు నోంకారంబు
బీజంబు గలదియై ♦ తేజరిల్లు
మాణిక్యవర్ణంబు ♦ మహిమమౌ సమరస
భక్తి వేహంసలు ♦ జరగుచుండు
గీ. గంగయమునానరస్వతుల్ ♦ గ్రాలుచుండు
నట సదాశివు నర్చించి ♦ యవలి తావుఁ
జేరఁబోవుదురయ్య నీ♦సేవకులిల
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౯౭

సీ. ఆజ్ఞేయమున కూర్ధ్వ♦మందు నారసిచూడ
వరసహస్రారంబు ♦ వరలుచుండు
నాసహస్రారంబు♦నందు కోమలములౌ
వేయి దళంబులు ♦ వెలయుచుండు
బహుచిత్రవర్ణముల్ ♦ పరమభక్తియు నట
ఝుంకారనాదంబు ♦ పల్కుచుండు
పదినూలుఁ హంసలు ♦ బరగుచునుండును
సాక్షిభూతంబగు ♦ సదమలాత్మ
గీ. జ్యోతిరూపంబుచే వెల్గు ♦ చోద్యముగను
దాని గురుకృపఁ గనుఁగొన్న ♦ ధన్యుఁ డరయ
నీవె యగునయ్య చూడఁగ ♦ నిక్కమిదియ
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౯౮

సీ. అండజరాడ్భూష ♦ చండదానవభీష
తాండవతోష స♦త్యమృదుభాష
భాషాధిపకపాల ♦ ఘోషాధికాభీల
వేషాఘలాశ్రిత ♦ విబుధకాండ
కాండ విద్విట్కాండ♦ఖండనఘనశౌండ
పాండురాంగపిచండ ♦ భరితకాండ
కాండజాంబకకాండ ♦ ఖండితరిపుచండ
చండాంశుహిమకర♦జ్వలననేత్ర
గీ. నేత్రరచిత గజాజిన ♦ నిగమహానన
హానరహిత సనాతన ♦ యభ్రకేశ
కేశతూణీర కలుష♦వినాశ యీశ
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ. ౯౯

సీ. సంగతరజతాద్రి ♦ శృంగ శంకర సర్వ
మంగళాధవ నీకు ♦ మంగళంబు
గంగానదీఝరీరం ♦ గజ్జటాజూట
లింగరూపా ♦ నీకు మంగళంబు
భృంగినాట్యక్లుప్తాను ♦ షంగ భక్తహృదబ్జ
భృంగాత్మకా నీకు ♦ మంగళంబు
అంగసంభవభంగ ♦ తుంగపుంగవరాట్తు
రంగ ధూర్జటి నీకు ♦ మంగళంబు
గీ. మహితమంగళకర నీకు ♦ మంగళంబు
మధురసారంగధర నీకు ♦ మంగళంబు
మంగళాత్మక యిదె నీకు ♦ మంగళంబు
ఈమునియగస్త్యలింగ బా ♦ లేందుసంగ. ౧౦౦

సీ. విద్య కంతములేని ♦ విధ మంద రెఱుఁగుదు
రంతకంతకు ఘను ♦ లవనిఁ గలరు
అందునఁ గొంచెము ♦ నభ్యసించితి నేను
సకలపండితులతో ♦ సముఁడఁ గాను
నీవు నాలోపల ♦ నిల్చి యీవిధమునఁ
బల్కించుచుండఁగాఁ ♦ బల్కినాఁడ
తప్పొప్పు లిపి యని ♦ తగ విమర్శింపఁగా
శక్తుండ నేఁ గాను ♦ శమనదమన
గీ. చెఱకునకు వంక పోయిన ♦ చెడదు తీపి
యనుచుఁ బల్కెడి లోకోక్తి ♦ ననుసరించి
నీసపద్యాళి సుమమాలఁ ♦ జేసి నీదు
కంఠమునఁ దాల్ప నొసఁగితి ♦ కరుణఁ దాల్పు
మీమునియగస్త్యలింగ బా ♦ లేందుసంగ. ౧౦౧

సమాప్తము.

సీ. మును కాశికారాజు ♦ ముద్దుకూతురు కళా
వతిని బెండిలియాడి ♦ రతి దలిర్ప
వరిథమసమాగమ♦మరిథి దినంబున
కాంతను బ్రేమచేఁ ♦ గవయఁబోవ
నకాంత యుపదేశ ♦ మందిన దగుటచేఁ
బతి నుపదేశంబుఁ ♦ బడసి కవయు
మన విన కాంతుండు ♦ నతివను జేపట్ట
నగ్నితుల్యంబైన ♦ నతిభయమున
గీ. వేడుకొనఁగ గర్గమునిపజ్జ ♦ వేగఁ జను మ
టన్న నాతఁడు చని మ్రొక్క ♦ నత్తపస్వి
మంత్రముపదేశ మియ్యఁగ ♦ల్మషచయంబు
కాకములు నయి తొక్కలు ♦ కమిలి పడియె
ఈమనియగస్త్యలింగ బా♦లేందుసంగ.

# ఇష్టలింగప్రార్థనము.

(పంచరత్నములు)

సీ. ఆధారమందున • నాచారలింగమై
వివిధగంధంబుల • విధము గాంచి
స్వాధిష్ఠమందున • సతతంబు గురులింగ
మైయుండి రసములు • నానుచుండి
మణిపూరమందున • మహనీయశివలింగ
మైయుండి రూపంబు • నరయుచుండి
వరుస ననాహత • వారిజమందున
చరలింగ మైయుండి • స్పర్శ గాంచి
గీ. సద్విశుద్ధంబునందు ప్రసాదలింగ
మగుచు శబ్దంబు వినుచుండ • దంతరమున
లీల నాజ్ఞేయమున మహాలింగ మైతి
విన్నింటి గ్రహింప నిచ్ఛచే • నిష్టలింగ.

సీ. పరగ నాసికయందు • వాయువునందున
నొకలింగ మగుచు నీ • వుండలేదె
అరయ జిహ్వావస్థ • లరిదు నశ్రాంతంబు
నొకలింగ మగుచు నీ • వుండలేదె

అక్షియుగ్మమునందు ♦ నంఘ్రిద్వయమునందు
నొకలింగ మగుచు నీ ♦ వుండలేదె
చర్మంబునందున ♦ శయయుగళంబున
నొకలింగ మగుచు నీ ♦ వుండలేదె
గీ. వాక్కునను శ్రోత్రశ్రీమందున ♦ పదల కెప్పు
డొక్కలింగంబవై యుండి ♦ రిక్కనగిది
లీల హృదయాబ్జమున మహా♦లింగ మైతి
విట్టి నిన్నెవరెఱుంగుదు ♦ రిష్టలింగ. ౭

సీ. స్థూలదేహంబున ♦ లీలమై రూపంబు
గ్రహియించి యిష్టలిం♦గం బనంగ
సూక్ష్మదేహంబున ♦ సుఖముగా మనుప్రిచుల్
గ్రహియించి ప్రాణలిం♦గం బనంగ
కారణాంగంబున ♦ కాంతుచే తృప్తిని
గ్రహియించి భావలిం♦గం బనంగ
వెలసి మూఁటికిపైన ♦ వెలుగు హృత్పద్మంబు
నందు మహాలింగ ♦ మైతినయ్య
గీ. సకలస్థావరజంగమా♦త్మకము నైన
జగము నీయందె నణఁగును ♦ జనన మొందు
నీవె దృశ్యము దృష్టయు ♦ నీవె చూడ
నిదియె నీతత్త్వమని యంచు ♦ రిష్టలింగ. ౮

సీ. నీవు నకారంబు ♦ నీవె మకారంబు
నీవె శికారంబు ♦ నిక్కముగను

నీవె వాకారంబు ♦ నీవె యకారంబు
నీవె సత్ప్రణవంబు ♦ నిర్మలాత్మ
నీవె మంత్రంబును ♦ నిజముగాఁ జూడంగ
మంత్రార్థ మీవె సూ ♦ యంత్ర మీవె
ప్రాణంబు నీయందుఁ ♦ బాదుకొల్పుటచేత
ప్రాణంబు నీవెపో ♦ భక్తపాల

గీ. అంగమెల్లను జూడఁగా ♦ లింగమయము
కాని మరియొక్కటియు గాదు ♦ కానివిధము
దేశికునికృపఁ గాంచిన ♦ ధీవరుల
కెఱుఁగఁదగినది భవభంగ ♦ యిష్టలింగ. ౪

సీ. చరమూర్తివై వచ్చి ♦ పరమపావనమైన
తీర్థ మిచ్చి యఘంబుఁ ♦ ద్రెంచివైచి
నీవు సద్గురుమూర్తి ♦ వై వచ్చి నెమ్మది
దయతోడ సత్ప్రసా ♦ దంబు నిచ్చి
ఐక్య మియ్యంగ నా ♦ యందుఁ గటాక్షించి
నిబిడచిశి నాకర ♦ నీరజమున
సతతము గురులింగ ♦ జంగమరూపముల్
పూని సన్నద్ధుఁడు ♦ ప్రోచుచుండ

గీ. నింక నేమి కొరత ♦ యేల నిన్నాశింప
నుతులుఁ నతులు గీత ♦ తతులు నేల
ఎందుఁ జూడ నీవె ♦ యెట్టుల నిన్నర్చింతు
దుష్టచయవిభంగ ♦ యిష్టలింగ. ౫

శివాభ్యాం నమః.

# శివభజనకీర్తనలు.



కేదారగౌళరాగము - రూపకతాళము.

హేరంబం తనురుగ్జితశశిబింబం - హృతవృజినకదంబం నమామి సతతం ॥ హే॥ గౌరీముఖాబ్జమిహిరం - కరుణాపారావారం - చారుతరాఖువిహారం - సకలామరపరివారం॥ హే॥ వాసవాదిసురసంచయవందితపదకంజాతం - భాసమానసిద్ధిబుద్ధిభామామణిసంసక్తం - వ్యాసాదిమానివినుతం - వారణాస్యం మహోన్నతం - హాసయుతం మల్లయాఖ్యదాసనుతం భక్తిరతం ॥ హేరంబం ॥ ౧

హిందూస్థానికాఫి - ఏకతాళము.

ప్రణమామి సద్గురునాథ మహం భవపాశవినాశకరం శుభాకరం ॥ ప్ర॥ అణిమాద్యైశ్వర్యప్రదం శిష్యజనావళిమనుప్రదం - మోక్షప్రదం ॥ ప్ర॥ ప్రీతిశిఖాజాలచోదితమహిమానం - స్మితమనోహారవదనం - భాసమానం ॥ ప్ర॥ దినకరకోటిప్రదీప్తకళేబరం - సనకాదిమునిసేవితం - సర్వాతీతం ॥ నాదబిందుకళాతీత మాజ్ఞేయనళినమధ్యవిరాజితం - సుపూజితం ॥ ప్ర॥ గురుతర శ్రీ తాడికొండ మల్లయదాసవరసేవితచరణం - దురితహరణం ॥ ప్రణమామి॥ ౨

బేహాగ్ - ఆది తాళము.

నమ్మితి గిరిసదన భుజగాభరణా॥నమ్మితి॥ నమ్మితి గిరిజానాయక శుభకర ॥ సదన॥ పుంగవవాహాన బుధజనపోషణ ॥

సదన॥ అంగజగర్వవిభంగ - ధృతకురంగ ॥సదన॥ తల్లజ తాడికొండ మల్లికార్జుననుత ॥ సదన॥ భుజగాభరణా॥ ౩

రాగము - ఏకతాళము.

నిన్ను నమ్మినాడ నీలకంఠ హర - నన్ను విడువ నీకు న్యాయమా సర్వేశ ॥ నిన్ను॥ దక్షమఘశిక్ష - యక్షరాజపక్ష కుక్షిభువన విరూపాక్ష హతవిపక్ష॥ నిన్ను॥ అండజాభరణ నీయండ జేరితి రార - పుండరీకాక్ష పరిపూజితచరణ ॥ నిన్ను॥ ఇందుశేఖర ముకుందశరవర - కుంద చందనారవిందసన్నిభాంగ॥ నిన్ను॥ అంతకాంతక నిశాంతీకృతనగ - చింతితార్థప్రద చెంత రా వదేర॥ నిన్ను॥ నిండువేడుక తాడికొండమల్లయార్యహృత్పుండరీకమున నుండి వెలుగొందు దేవ ॥నిన్ను॥ ౪

బేహాగ్ రాగము - చాపుతాళము.

పాహి చంద్రశేఖర పాపతిమిరభాస్కర - మాం ॥పా॥ దేహి శుభ మేహి మమ దేవపూజిత - వాహీకృతోక్ష స్మరదాహి నీలలోహిత శివ ॥పా॥ సంగతాద్రినికేతన - పుంగవరాట్కేతన - సర్వమంగళాహృదబ్జభృంగ మల్లికార్జున - సంగత గణపుంగవ భవభంగ ధృతకురంగ లింగ ॥పా॥ కుండలీంద్రభూషణ - క్రూరత్రిపురశోషణ - హర చండదనుజవిపిన మరుత్సఖ విభీషణ - మండిత శ్రీతాడికొండమల్లికార్జున పోషణ మాం ॥పాహి చంద్రశేఖర॥ ౫

బేహాగ్ రాగము - ఆదితాళము.

శంకర మొ రాలించరా - శివ శంకర మొ రాలించరా॥ శంకనిర్మగ్నుడ భయమోహాకలితుడ - బింకాము వదలి నా

వంక కిటు రార శివ ॥శం॥ నీరాధితూణీర - నిగమాంతసంచార-
నేర మెంచక నను కోరి రక్షించు శివ ॥శం॥ అభవ నీకన్న దలచ
నన్య దైవంబు నీ-దర్శన మొసగి నన్నాదరించు ॥శివ శంకర॥
శుండాలాజినచేల యండ బాయక తాడికొండమల్లికార్జున
మెండుగ బ్రోచినట్టి ॥శంకర మొరాలించరా॥ ౬

ఆదితాళము.

ఈశా ఈమునిపురీశా నను బ్రోవరహార జగదీశా॥ శేశధర
త్రిలోచన కలుషవినాశా భవపాశవిమోచన ॥ఈ॥ అంగజాత
విభంగ కంధినిషంగ దనుజవిభంగ ధృతకురంగ ॥ఈ॥ వామ
దేవా మానివంద్య - సామజాసురహరణ భవహరణ ॥ఈ॥
తల్లజశ్రీతాడికొండ - మల్లికార్జున సుతచరణకమల॥ ఈశా
ఈమునిపురీశా॥ ౭

తోడిరాగము - ఆదితాళము.

సాంబ నీకు నామీద సరగున దయరాద - అంబరకేశ
నీయండ జేరితి రార ॥సాం॥ పురుహూతముఖసురపూజితపద
యుగ - గిరివరచాప హ్రాత-గీమ్ర్పతికంధర ॥సాం॥ ఎంత నే వేడిన
పంతమా నామీద -చింతలు దీర్చ్ నా చెంతకు రార హర ॥సాం॥
మును సిరియాళునకు మున్నె నీ కిచ్చెనా ఘనుడు మార్కండేయుడు
కానుక లిచ్చెనా ॥సాం॥ గుహజనక భవఘోరకలుషహర -
మహిని తాడికొండ మల్లికార్జుననుత॥ సాంబ॥ ౮

రాగము - చాపుతాళము.

సారసాక్షపూజితా హరా - ఉరగాభరణా - గిరిజాత
హృదంభోజభృంగ - భూధరాధరకార్ముక ॥సా॥ మో

గీంద్రసుపూజితపదసారసయుగళా - నాగాజినవరపరిధానాంగ మహేశా - భవ - రోగహరా - మోక్షకరా క్షేమకరా - వినతసురా ॥ సా॥ రజతాచలశిఖరాగ్రనిశాంతవిహారా - విజితాఖిలగర్వితత్రిపురాసురనికరా గో-రాజహయా - భీతిశయా - కామజయా - భక్తశయా ॥సా॥ ఫుల్లాబ్జామరకరిశరసన్నిభదేహా - కల్లోలినీనాయకతూణీర-గిరీశా - తల్లజశ్రీతాడికొండమల్లికార్జున పోషక హరా ॥సారసా॥ ౯

కీర్తన.

బిరాన నను బ్రోవరా గిరీశ శంకరా ధరాధరశరాసనా - హరా పరా కేలరా నన్ను బ్రోవ ధరాత్మజామనోహరా పరాత్పర ॥బిరాన॥ సరీసృపాధిపధరా భవా శర్వరీశశేఖర దరీచరా - నిరీశ మానవ నిరీహ మునిసుందరీకమన భవ గిరీశ త్రినయన ॥బిరాన॥ నతావనా నుతదశాననాభవవితానకాననహుతాశనా కృతాంతచేతఃస్థితావలేపాపహత ప్రతీతప్రతాపభీకర ॥బిరాన॥ రాకేందునిభప్రతీకాఖిలామరలోకాభినుత త్రిలోకేశ్వరా - ముకుందసఖ తాడికొండ మల్లయ నకల్మషుని జేయగోరెదను శివ ॥ బిరాన నను బ్రోవరా॥ ౧౦

బేహాగ్ రాగము - ఆదితాళము.

హర హర మహాదేవ - మహానుభావ - తరలుమి నను బ్రోవ - అభవా ॥ హర ॥ పరశివ శంకర పరమదయాకర - కరిసురవర హర - గిరివరకార్ముక॥ హర॥ సిరిచే మురియుచు శివుడన దెలియక - పరిపరివిధముల దిరిగెద రవనిలో॥ హర॥ కూటికొరకు బహుబూటకములు గొని - బాటబాటలను బడి

యాచింతురు॥ హర॥ జనులవలన - శుడువని కడుధనముల గొని సతిసుతులకు గొనుమని యిడుదురు॥ హర॥ చనుబాలిడి తల్లి సాదిన దందురు - చనుల పాలిడిన శర్వుని గానరు॥హర॥ సర్వేంద్రియముల సౌఖ్యముగని యివి శర్వుడొసగెననిజను లనేరరు॥ హర॥ శంకర నీనుతి సల్పిన కాలుసికింకరుభయను మొక్కంతియు గానరు॥ హర॥ మహిని తాడికొండ మల్లికార్జునుని - దహా రమునను విల్చు దైవశిఖామణి॥ హర హర। ౧౧

కీర్తన

ఇంటికి రావెందుకు ముక్కంటి పీవెవందుకు - కంటి మంటిచేతను బల్లుంటవిల్లు వణచుసామివి ॥ఇం॥ మున్ను శిరి యాళునింటికి ముదముతో నేతెంచి యాతని - కన్నసుతు మాంసంబు వేడి తిన్నగా సుతు నిచ్చు సామివి ॥ఇం॥ మాన్యుడా కన్నప్పయెంగిలిమాంసమును భక్షించి యతనియ-గణ్యమా భక్తికిని మెచ్చి కరుణతో కైలాస మొసగితి ॥ఇం॥ ఇందుశేఖర సుందరాంగ ముకుందసఖ హర శంకరా - నందివాహన దారు వనమునిసుందరీమణికాముకుడ మా ॥ఇం॥ బాలుడౌ మృకండుసూనునిప్రాణములు గొనిపోవవచ్చెడు - కాలునిగర్వం బడంచి బాలు నేలిన సామి వట - మా ॥ఇం॥ ధరణిలోపల యరి పిరాల - పురములో వసియించి భక్త - వరులను బోషించునట్టి పరమపురుష శివానోహరా ॥ఇం॥ అండ బాయకను తాడికొండ మల్లికార్జునుని - దండిగాను నేలినట్టి కుండలీంద్రభూషణా ॥ఇంటికి॥ ౧౨

## కీర్తన.

శంకర శంకర శంకర మహాదేవ - పంకజభవశచీపతి ముఖసురనుత ॥శం॥ ఇందూశేఖర నీ వెందూ దాగితివో - కందూవ మీర నాకనులకగుపడవేల ॥శం॥ ఫాలలోచన యింత జాలమేలారా భక్త - లోలూడా వనుమాట లోపమయ్యేనా నీకు ॥శం॥ కరధృతశూల నాపై కరుణ యించుక నుంచి - సరగున వచ్చి నీచరణ మియ్యవు నాకు ॥శంకర॥ దండిగ శ్రీ తాడికొండ మల్లయహృత్పుండరీకమునా నుండి పోషించూ దేవ ॥శంకర॥ ౧౩

## కీర్తన

నీలకంఠా నన్ను బ్రోవ - జాలవేమో తెల్పుమయ్యా- చాలవేమో తెల్పు నీజోలి నాకేల నయ్యా ॥నీల॥ దిక్కు నీ వాని యంటీ - దేవుడ వీ వనుకుంటీ - మ్రొక్క నెవరు లేడన వింటీ- ముక్కంటి నిన్ను గంటి ॥నీల॥ తల్లి దండ్రీ వనుకుంటీ - దాత వీవని నమ్మికుంటీ - మల్లికార్జునాని యెపుడు మఱువకుండా ప్రోవుమంటి ॥నీల॥ కాలకంఠా కర్త వీవే కారయితవు నీవె యే జోలియేమి లేనట్టి నాపై నేల కర్మమనుచు నిల్పా ॥ నీలకంఠా॥ ౧౪

దర్బారురాగము - ఏకతాళము.

శివ నాకిక నేల భయము - పూజింపగ చేకూరె నీపదద్వయము - భవ భవాబ్ధిప్లవ విదారితపాపనిచయా శ్రితజనావన - భువనచయపూరితప్రచండ శ్రీవిమలాంతఃకరణ శ్రీనయన ॥శివ॥ గగనాదిమునిజనవంద్యా - నిసర్గదూరీకృతనింద్యా ॥శివ॥ స్వర్గరాణ్ముఖవరదివౌకసవర్గమకుటాగ్రి

ప్రదీపితదుర్గమప్రవిమలనురత్నద్యుతినిచయనీరాజితపదాం
బుజ ॥శివ॥ వాతాశనాధిపాభరణా - పరేతరాడవలేప
హారణా - భూతిరుద్రాక్షమణిమాలావ్రాతయుతవక్షణా
మంతర్జ్యోతిరూపోహ మ్మటంచని ప్రీతిచే సగుణుండ వైతివి ॥శివ॥
మల్లికాసుమసన్నిభాంగ - ప్రఫుల్లమునిహృత్పద్మభృంగ -
భిల్లవేషాశ్రితపృథాసుతల్లికాతనుజాస్త్రదాయక - హల్లకాశుగ
జనకసంగ - మల్లికార్జునహృన్నికేతన ॥శివ॥ ౧౫

దర్బారురాగము - ఏకతాళము.

ప్రోవసమయ మిదె భోగిభూషణ నన్ను ॥ప్రోవ॥ భావ
మునను నిను బాయక వేడుచుంటి ॥ప్రో॥ కన్నసుతుని మీద కని
కర ముంచుట - మిన్నయె నీవు నాకన్నతండ్రివి కాద ॥ప్రో॥
సుతునిగుణము లెంచ పితరున కగునా - కతిపయదినములు గను
గొనవలదా ॥ప్రో॥ భక్తసుగుణములు పరికింపగా నీకు - యు
క్తమగును నే శక్తుడ గాను శివ ॥ప్రో॥ మహిని తాడికొండ
మల్లికార్జునుని - బహువిధముల గా పాడిన దైవమ ॥ప్రో॥ ౧౬

కీర్తన - కళ్యాణి - రూపకము.

శంభో మహాదేవ శంకర గిరిజామనోహర ॥శం॥ జంభారి
ముఖనిర్జరసంభావితపాదకమల - అంభోధినిషంగ మాని
శుంభన్మానససరోజబంభర శుచికుముదబాంధవాంభోజసఖాక్ష
వరద ॥శం॥ తారాద్రినికేతన భవపారావారోద్ధారక - స్మే
రానన వృజినహరణ - క్రూరాసురమదవిహరణ - హార తుషార
మహీధరహీరతారనారదశర - శారదాబ్జపారదప - టీరసన్ని
భాపఘన హార ॥శం॥ అండజపరివృఢమండన - దండ

ధరమదవిఖండన - శుండాలాజినవసనా - ఖండేందుధర త్రిన
యన - అండపిండబ్రహ్మాండవిలీనపిచండపూరితాఖిలాబ్జజాండ
తాడి-కొండమల్లికార్జునహృత్పుండరీకనిలయ గిరిశ ॥శం॥౧౭

కీర్తన.

శ్రీమహేశ భవనాశా - గిరిజాధీశ నన్నుబ్రోవ సమయ
మురా ॥శ్రీ॥ సోమకళాధర శుభకర భవహర-కామదమన సనకా
దిమౌనినుత ॥శ్రీ॥ సకలభక్తహృత్సారసదినకర - సకలశ్రుతి
శిఖాసమితినుతమహిమ ॥శ్రీ॥ కనకమహీధరకార్ముక పావక -
దినకరశశినయన దివిజవందిత ॥శ్రీ॥ నందివాహ ముకుందశర
వర - కుందబృందమరందనిభకరణ ॥శ్రీ॥ భిల్లవేషధర భీమ
త్రిపురహర - మల్లికార్జునుని మనిచినపరశివ ॥శ్రీమహేశ॥

కీర్తన.

ఏంతాటివాడవయ్యా సాంబయ్య నీ - వెంతాకు తగుదు
వయ్యా ॥ సంతతము నిను చింతజేసెడి యంతకాంతక భక్త
గణముల - సంతసము మీరగను వడి నీయంతవానిని జేతు
వయ్యా ॥ఏం॥ తిమ్మవ్వయింటి కరిగి యింటను వానియమ్మ
లేకుండుట నెరిగి - కమ్మని యప్పచ్చి తెమ్మని కొమ్ము తిను
మని చెప్పి వానియమ్మచే జంపించి రోకట సొమ్మసిల దెబ్బతిని
వచ్చితి ॥వెం॥ మున్ను కాననమందు - దిక్కులేకయున్న నిన్ను
జూచి - వన్నుగా బూజించి నీకు తిన్నవి యుపహార మిడ తిని-
కన్ను దీసికొని నీవు తిన్నని యగుపడకుండజేసితి ॥వెం॥
తల్లిలేని నిన్ను బెజ్జవ్వ తా తల్లియై పెంచగను - కల్లయగు

రోగమును జెంది పిల్లుగా నామె నేడ్పించి - మెల్లగా మాయమ్మె యూపెను తెల్లముగ గజతిగిరి కనిచితి ॥వెం॥ భిల్లాణభూపాలుని - బానిసనడిగి - భార్య నియ్యగ జూచి - మల్లెపువ్వుల పాన్పుపై యూపల్లవాధరి వచ్చి నిల్వగ - పిల్లవాడ వై శివయ్య మల్లికార్జున గాసపోవక ॥ఎంతాటి॥ ౧౯

వలు

సాంబ సాంబ శివ శర్వ మహేశ్వర సామజనుదరిపుచర్మధరా - సుబాహుహారనుత సురారిసంహార సుధీపినుత గంగాధరా ॥ సాం॥ సాగనాత్మ నాయక భవక గుణాసాగర శశిధరశమన హారా - సరోజభవముఖ సురాళినుత పదసరోజ సురగిరిశరాసనా ॥సాం॥ నందివాహనా నాగభూషణా వందిసజనపరిపాలనా - బిందునదనమధ్యస్థిత నిత్యానందమయాభవనీరామయా॥సాం॥ కూర్పిరపురదనుజజాలహర కలుష వార నిబర్హణ మారహరా - హారహీరమందారతుషారపటీరసన్నిభాకార హారా ॥ సాంబ ॥ స్వాదంతరంబున దధీచిముఖమునికదంబ మియ్యాది దలంతురో - ముదం బలరనప్పదం బిమ్ము నీపదంబు వదలను పరాత్పరా ॥సాం॥కుండలిరాన్మణికుండల తాడికొండనుల్ల యాఖ్యానిమానసమం - దుంఢి యెల్లప్పుడు పోషింపు జగద్బ్రహ్మాండభరణ కలకంఠవరా ॥సాం॥ ౨౦

ధన్యాసి - కీర్తన - ఆదితాళము

భక్తి గల్గినను భయ మెక్కడిదీ ప్రపంచమందున జనములకు-భక్తిముక్తిసాధన మనియెనులోకకీర్తిని జనులనురక్తినివినరా ॥భ॥ గోపబాలకుడు శిల బూజింపగ గోపిక దానిని దీయుతరిగ - ఆపాపడు గని హా యనునంతనె- గోపతి వానిగ్ కృపజూ

దడ్డమును - ॥భ॥ మక్కువ మైథునరాముడు శ్రీగిరి కక్కబా
వలనః తేబోవక - అక్కబావ లయి యుమామహేశులు
గ్రక్కున వానితో కదలరె మున్ను ॥భ॥ బాలుడైన మార్కం
డేయుని మును కాలుడు గొనిపోవగ రాగ - నీలగళుడు ప్రత్య
క్షంబై యాకాలు నడచి చిరజీవిని జేయడె॥భ॥ అండజరాడ్వా
హనునివయిని హృత్పుండరీకమును జేర్చపలెక - దండిగ తాడి
కొండ మల్లయను దండనుండి రక్షించెడి శివుపై॥ భక్తి॥ ౨౧

శహాన - కీర్తన - ఆదితాళము

దేవా నీకన్న నెవరుబ్రోవ - భవానీధవ ॥దేవ॥ తావ
కీన పాదపంకజములను - భావమందు నిడి పరిస్తుతించెదను ॥దే॥
ధీరా ఖంతరింప నీ కిది మేరా - రజతాద్రివిహారా - దారువిపిన
మునిదారకమన భవ - క్రూరత్రిపురసురవైరివారహార ॥దేవా॥
ఔరా పలుమారు నిన్ను నే కోర- కరుణించవదేర - కోరనేల
భక్తులపాలించెడి భారమైన బిరుదు నీకులేద॥దేవా॥ గంగాధరకర
ధృతకురంగ - శ్రితకరుణాపాంగ లింగ తాడికొండ మల్లయ
హృత్సంగ కలుషచయభంగ చంద్రధర॥ దేవానీకన్న॥ ౨౨

చక్రవాకము - ఆదితాళము

హర హర శ్రీవరా పరమపావనశివ ॥హర॥ శరజజనక
నీదుచరణములను నాహృ - త్సరసిజమున నిల్పి సంస్తుతించెద
నయ్య ॥హర॥ శశిమకుటా యెంత స్తవము జేసినను - పశువనితాల
చితొాపతివినీవుగాద ॥హర॥ ఫాలనయన నే నీపాలబడితినన్ను పా
లనుముంచేవో నీళ్లముంచేవో నీవు ॥హర॥ మహిని తాడికొండ
మల్లికార్జునుని - నహరహమును బ్రోచు నధిపతి వీవె
కాద॥ హర హర శ్రీవరా॥ ౨౩

బిలహరిరాగము - త్రిశ్రగతి.

సరిససనిదని - పదపమగరిగ - సనిదపమగ - గిరివిహా అరణ - దురిత శమన గరళహారణ సరిగపదరిసా। పదసరి గగ - రిగరిసాస కరధృతహారిణా। కరుణలవాల కరిచర్మచేల సరిససనిద్దా - నిసినిన్నిదపా - పదదదపమా సురగణపాలా - కరధృతశూలా - వరభక్తలోలా గరిగసా-సరిగపదరిసా। వర కమలా-స్మరమదహారణా॥గిరివిహారణ। పదపమగరి - గాపదసా- పదపమగరి - మగరి।

౧ శ్రితజనవన - చిద్విలసా - పతితపవన - కైలస సనా। పదసరిగగ - రిగరిసస - దదరిసనిదపసా। సితకరధర- త్రిపురదనుజ-తతివిశోషణ। పదపమగరి - సరిగపదరిసా సరిస సనిదని ఉమరమణ - విషధరభరణా॥ గిరివిహా అరణ॥

౨ పల్లవారుణ - కేశపాశ - మల్లికార్జునదాసపోష - కలశజముఖమునినుతపద-కమలయుగళ - జగద్భరణ - సుర నుతిచరణా॥ ౨౭

చేహాగ్ రాగం - త్రిశ్రగతి.

నినినినీని - ససస - నిసరిస - నిధప - మపధ భవ వినాశ -పార్వతీశ - భగణ కావు సనిధపా - గమపధనీ -

మా - అఅఅఅఆ - భవవినాశ - గగగగారి - గమ పధనిసరిసనిధపమ - భువనపోషక అఅఅఅఅఅఅఅఅఆ - గగరిసరిగారిసా - గమపధనీ-

భూతిదాయకా - అఅఅఅఆ - భవ - గరిసనిదద - రిసనిధపప - సనిధమాధపా - శ్రాన్తిశమన - శాంతినిధాన-

సంశ్రితపాలనా - మగమపపా - మపధపదదా - పదనిదనినీ భాసురగాత్రా - పావకనేత్రా- భవ్యచరిత్రా- ననగసా_ సని ధపమగరిగమపధని - భవహారా - అలఅలఅలఅలఅలఅలఅల-॥భ॥

పాలితసుజన - భక్తాధీన పంకవిమోచనా - మల్లికా సుమమహితశరీర - మల్లికా - ననఘన - అలఅలఅలఅలఅలఅల అల ॥భ॥

బిలహరిరాగం - త్రిశ్రగతి

పురహారఅశంకర ధరసుతావర పరా అత్సర హారా అలఅల స్మరమదహరణా - సురవందితచరణా - ఉరగభూష ణా - అరివిభీషణా - సురకిరివరహారిశరధరధవళకరణా - అల అల ॥పురహార॥ వేదశిఖావినుత మహితభేదరహితజననిరతా - నాదరు ఉపసుర వినుతానంతరూపమునిజనతా - వ్యక్తనతా నక్తహితావ్యక్తశ్రుతికథితమహిమలక్ష్యాంతహార ॥పురహార అ శంకర ధరసుతావర॥ ౨౯

కీర్తన

చంద్రశేఖరా- శైలజావరా - ఇంద్రగజాకాశసరిచ్చం ద్రనిభాంగ ॥చం॥ కంబుకంధరా - కాలసంహారా - అంబుజ భవహరిహయాద్యమరసేవితా ॥చం॥ నందివాహనా - నాగ భూషణా - మందిరీకృతాచలేంద్ర సుందరాననా ॥చం॥ ఫాలలోచనా - భవపాశమోచనా - నీలగళ త్రిశూలధర కపాలభూషణా ॥చం॥ దక్షమఖహరా త్ర్యక్ష పురహరా - యక్షరాజపక్ష గణాధ్యక్ష శుభకరా ॥చం॥ మల్లికాప్రసూన - హార భవానఘ - భిల్లరూపధర పోషితమల్లికార్జునా ॥చం॥

కీర్తన - చక్రివాకము - త్రిశ్రగతి

నిన్నె నమ్మినానురా - నీలకంఠ ప్రోవరా ॥ని॥ పన్నగాశ నేంద్రినాహాపతే విరూపాక్ష హర ॥నిన్నె॥ ఎంత వేడినను కానంతదయరాదుగా - పంత మేల నిన్ను వదలి పరుల నే వేడరా ॥ని॥ భుక్తిముక్తిదాయకా - భువనత్రియనాయకా - భక్తుల పాలించ నీకు భారమా పశుపతి ॥ని॥ సుతుని తండ్రి చూడకున్న నితరు లతని జూతురు - పతితపావన నీదునామము పఠనజేయుచుంటిరా ॥ని॥ అండజాభరణ తాడికొండ మల్లికార్జునుని - నిండుకృపను బ్రోవుమా ఖండలాదిసురనుతా ॥నిన్నె॥ ౨౭

హిందుస్థానికాఫి

మాయాసారం బీసంసారము - జాయాత్మజులే పాశబంధములు ॥మా॥ హేయములగు కామానలములో బడి ఇంద్రియములచే నీడ్వబడుదురు స్త్రీ-కాయములను గని కడుమురిసెదరు - కాయవిధంబును గనుడు దెల్పెద ॥మా॥ తోలు నెముకలును దుర్మాంసంబును- చాలగ రక్తము స్నాయువు చీమొక - మూలమల మొకటమూత్రముగల దిది - కీలువదలినను మూలబడును బొమ్మ ॥మా॥ తాను శరీరము తాను ప్రాణమో-తానన నెవరోతత్ప్రకరణము - నేనివి కాను నిజము మల్లయాభిధానుని బ్రోచిన దైవము నేనను ॥మాయాసారం॥ ౨౮

శహానరాగము - ఆదితాళము

ఎందుకీ గర్వము ముందుగతిగానక - ఇందుధరుని యుల్లమందున దలచవు ॥ఎం॥ సుందరీమణులను చూచి కోరెదవు ముందు యముని గానవెందుకో తెలియను ॥ఎం॥ ధనమున్నది

యని తెప్పక మురిసేవు - ధనమెక్కడనో తా నెక్కడనో ॥ఎం॥ పంచాక్షరిజపపద్ధతి తెలియుము - పంచవక్త్రునిపజ్జను జేరుము ॥ఎం॥ మును సౌందర్య మనువున నారకుల బనిచెనో లేదో భవునిపురికి విను ॥ఎం॥ శివశివ యనుము భవము వదలుచును - శివునికన్నగతి క్షితిలేదని నమ్ము ॥ఎం॥ మహిని తాడికొండ మల్లికార్జునుని దహరమునను నిల్పుదైవమును గను ॥ఎందుకీ గర్వము॥ ౩౦

ధన్యాసిరాగము - ఆదిరాగము

ఈశ్వరచిత్రం బెవరికి దెలుసును ఇలలోపల గనుగొన తరమా - నశ్వరమగు నానావిధ మాయావిశ్వము సత్యంబని మది దోచును ॥ఈశ్వ॥ బి. ఏ. బి. ఎల్ ప్యాసయి సర్టిఫికెట్లను చేబూని - చయ్యన నౌకరి చేయుదు నని యమసదనమునకు జనియెదరు ॥ఈ॥ సతతము ధన మార్జించియుందు మని సౌధ ములను నిర్మించి - వెతలు గుడిచి భూతి మున్న దనుచును సతిసుతయుతముగ సదనము వదలెద ॥ రీ ॥ చిన్నతనమునను తలిదండ్రులులేక చెంతదీయువార లెవరు లేకను - కొన్నినాళ్లు బికిరమెత్తి తుదకును - వన్నెమీర ప్రభువై విలసిల్లును ॥ఈ॥ ఎన్నగ 'సర్వంఖల్విదంబ్రహ్మ' యన్నది యెవరికి దెలియదుగా - పన్నగధరభక్తులెవరూ వార - లున్నది యున్నట్లు నెరుగుదురు గాని ॥ఈ॥ కుండలిపతిపర్యంకశరుసి హృత్పుండరీకమున దల చండి - దండిగ తాడికొండ మల్లయను నిందు వేడ్క పరిపాలన జేసిన ॥ఈ॥ ౩౧

## కీర్తన.

మహాదేవా మహాదేవా యనుము మదిలో నెప్పుడు మరువకుము - ఇహపరసౌఖ్యం బిచ్చెడి దేవుం డిందుధరు డని కనుగొనుము ॥మ॥ మహాదేవా మహాదేవా యనియెడి మనుజుని విడువక వెనువెంటనె - అహరహమును లేగను ధేనువువలె నరుగుచుండు శితికంఠు డిల్లనె ॥మ॥ పంచాక్షరిమంత్రము పఠియింపుము పంచవక్త్రుని దయగనుము - సంచితంబులను దుంచివేసి శివసాయుజ్యంబును బొందవలెనె ॥మ॥ ఎక్కడ జూచిన దృక్కు లెదుట నాముక్కంటిని బొడగాంచవలెనె - దిక్కు నీవ యని మక్కువతోడుత చక్కగ భక్తిని మ్రొక్కవలెనె ॥మ॥ పుండరీకదానవ ఖండను వ్యాత్ప్పుండరీకమున నిల్పవలెనె - నిండువేడ్క తాడికొండమల్లయను - మెండుగ బ్రోచిన దండిదొరనె ॥మహాదేవా మహాదేవా యనుము మదిలో నెప్పుడు మరువకుము॥ ౩౨

### నాదనామక్రియ - ఆదితాళము.

హరహర యనరాదా - నీవు - గురునిమాట వినరాదా - నిరతముహరుని స్మరణజేయుమని పరిపరివిధముల బల్కెడే గురుడు ॥హ॥ మూపు లింగమునను - నిల్పి - చూడుమనడె నిన్ను - పాపలనడుమను దీపించెడి యా ఆపోజ్యోతివి నీ వన వినవె ॥హ॥ బిందువుగనుగొనుమా - నాదము - పొందికతో వినుమా - బిందుమధ్యమున జెంది వెలింగెడు సుందరమగు కళ చూడుమనవినవె ॥హ॥ వేయిదళంబులతో - నెప్పుడు - వెలిగెడి స్థలమునను - వాయువు నిల్పి వరుసను జూచిన - హాయిగ నీశ్వరు డగుదు వనడె ॥హర॥ గట్టిగ సద్గురుని-మాట - పట్టి దవక నమ్ము - ఒట్టుబెట్టు

నట్టేట పుట్టి మునుగట్టి త్రోవలను మట్టుపరచి యిక ॥హర॥
వట్టివాదములను - నీవు - బెట్టుకొనుచు సభల - పొట్టకూటికయి
పొరలుచుండెదవు గట్టువిల్తుని దిట్టముగా నమ్మి ॥హ॥ నిందు
వేదుకాను - తాడి-కొండ మల్లనాఖ్యు - నండబాయగను
పోషించెడి యాఖండపరశునకు కరములొగ్గి యిక ॥హర హర॥ 33

పూరీకల్యాణి - రూపకము

ధ్యాయేహం వృషవాహం ధ్యేయమప్రమేయమజం
॥ధ్యా॥ త్రయజభవముఖసురసముదాయపూజితాంఘ్రియుగం
॥ధ్యా॥ సుందరతరరజతాచలమందిరవాసం త మభవ మిందు
కళాధర మహిరాడ్బృందాభరణం శరణం - వందితభక్త
కదంబం - వర్ధితభవనికురుంబం - మందస్మితముఖబింబం -
మల్లికార్జునాలంబం ధ్యాయే॥ 3౪

సేహాగ్ రాగము - ఆదితాళము.

రాజతు తేచరణం - శిరసి మే - శరణం భవహరణం -
హర ॥రా॥ పూజితమనిశం - బుధజననికరైర్భ్రాజమాన మఖ
లామరహారా ॥రా॥ భక్తపాలతలభస్మవిలిప్తం - భుక్తిముక్తి
ఫలమూలకారణం ॥రా॥ తాడితఘోరకృతాంతమనారతమీ
డితమానిప్రజమఘహరణం ॥రా॥ పుల్లమల్లికాసుమచయార్చి
తం - మల్లికార్జునహృదంబుజశరణం ॥రా॥ 3౫

శంకరాభరణము - ఆదితాళము

నీకన్న నెవరు నను బ్రోవగ నీజగమున శివ ॥నీ॥
లోకేశ భూతేశ మహేశ గిరీశ ॥నీ॥ పాకారిముఖదివౌకసవం
దిత - భీకరాసురహర భీమ కరుణాకర శంకర ॥నీ॥ నందివాహన

ముకుందవిశిఖభక్త-బృందహృదయాబ్జమిళింద గౌరీధవ త్రిన
యన ॥సీ॥ అండజాభరణ ప్రచండశమనాంతక విధుమండన-
కొడికొండ మల్లికార్జునావన భవహర ॥సీ॥ 36

శంకరాభరణరాగము - రూపకతాళము.

భక్తిభిక్షమియ్యవే తల్లి ॥భక్తి॥ వాణీ మృదుపాణీ -
అలివేణీ - గీర్వాణిసుందరి ॥భక్తి॥ ఇందువదన సుందరాంగి -
మందహాస భువనేశ్వరి - అందెలు పాదములయందు - అమరి
యున్న ఆదిభారతి॥భక్తి॥ శారద నీ నామము నే - సారమైనపదవి
యనుచు - ఏమారక భజనసేయ - సామాన్యుల కలవియే తల్లి
॥భక్తి॥ పరమగు వాసనలతోడ - సిరము గాను పిడువూరను -
వరము లొసగి ప్రోవు మమ్మ - వాగ్దేవి త్రిపురసుందరి ॥భక్తి॥ 37

కల్యాణిరాగము - ఆదితాళము.

కరుణ జూడు మంబ నిన్నె నమ్మితి। నిరంతము సరోజ
సంభవునిసతి ॥కరు॥ వరశుకాక్షసర గ్రంథవీణా - సరసిజములు -
కరముల గల జాణా ॥ కరు ॥ శరచ్చంద్ర చందనశరశారద - శరద
శంకరాద్రికుందనారద - సురసరిత్ఫణీశహారపారద - సురుచి
రాంగ సత్కళాపికారద ॥ కరు ॥ సుందరద్విరేఫతుల్యవేణీ ।
సుస్సైకతప్రతిమానశ్రోణీ - బృందారకగణశ్రేష్ఠురాణీ- ఘృణా
వనత- దివాకరసశ్రేణీ - నందివాడ జగన్నాథపోషిణీ - నవ్య
దివ్యమణిమయభూషణీ - ఛందోమయమూర్తి-మధురభాషిణీ-
శాశ్వతస్వరూపిణి । కల్యాణీ- ॥ కరుణ ॥ 38

కం. కంరాఢ్య దనుజవీరుల
హుంరావ మెసంగఁ గూల్చి యుర్వీస్థలిలో
రాం రామా యనఁ జొచ్చితి
సంరక్షింపవుగదయ్య సారసనయనా! ౧
కం. పుంరూపధారి వగుచు న
పాంరాడ్భాగస్థనగరపతి సురవైరిన్
కంరాజిఁ గూల్చి కెడపితి
సంరక్షింపవుగదయ్య సారసనయనా! ౨
కం. మాం రక్ష రమాధవ యని
స౦రావ మొనర్చుకరిని సంభ్రమమున వా
రాంరాశిశయన! ప్రోచితివె
సంరక్షింపవుగదయ్య సారసనయనా! ౩
క. హాం రం బీజద్వితయము
ఆం రాం బీజద్వయంబు హరహరులు తగన్
ఓంరాజతార్ణ మభవుడు
సంరక్షింపవుగదయ్య సారసనయనా! ౪
మ. కవితాకన్యకు గాంతుఁ చే నరులకుం గైసేసి యర్పింప వా
గ్ధవవంశస్థుఁడఁగాన; నెమ్మదిని శంకంబూని వాక్ప్రీతి త్వ
త్స్తవముం జేయఁగనోపనైతి సుగుణశ్లాఘ్యాగ్రణీ నన్ను గౌ
రవం బొంజేయుట చేయకుండుట భవద్రాజద్దయజ్ఞత్వమే. ౫
చం. సదయు ననారతం బఖిలసంపద లొందఁగఁ జేసి భవ్యమ
త్సదనమునందు బుత్రులను సస్యములన్ బశుజాలముల్ దగన్
గొదువ యొకింతలేక సమకూర్చుమహాత్ముని జంద్రశేఖరున్
వదలి ధనాఢ్యులన్ గదిసి వర్ణన సేయఁగనేల మాకిలన్. ౬

## కీర్తన

శివ శివ శివ శివ - శివ యనుడీ - శివు మదిలోపల గనుగొనుడీ॥ భవసాగరమున బడకుండీ - భవుని లోపలను దలచండీ - ఫాలనయనుని మరువకుడీ - కాలము వృథగా జేయకుడీ ॥౧॥ పంచాక్షరిలో నిదియేకదా - పంచత్వంబును బాపుగదా॥ ౨॥ సకలవశీకర మిదియేకదా - సకలము దెలిపే దిదియేకదా ॥౩॥ అంతట నిండిన దిదియేకదా - అంతర్జ్యోతియు నిదియేకదా ॥౪॥ కారణకారణ మిదియేకదా - తారకమనగా నిదియేకదా ॥౫॥ పరిపూర్ణంబును నిదియేకదా - పరశివతత్త్వం బిదియేకదా ॥౬॥ చింతలెల్లను విడువండీ - శివచింతన మదిలో జేయండీ ॥౭॥ అంతకు నివృత్తి యిదియేకదా - అంతకు గూల్చిన దిదియేకదా ॥౮॥ తెల్లం బయినది యిదియేకదా - మల్లికార్జునుని బోధిమగదా ॥౯॥

## కీర్తన

శంకర శివా - శంకర శివా - శంభో మహాదేవ శంకర శివా - బింకామయా నన్ను జూడావయా - సంకటములు బారదోలవయా - మృత్యుంజయా నీవేనయా - మృత్యుభయం బెడబాపవయా ॥౧॥ ఏదాయ నామీదా దయా - వేదాంతాయ నన్ను సాదవయా ॥౨॥ దండమయా - తుండీహాయా - అండా బాయక తోడ నుండావయా ॥౩॥ దక్షాధ్వరాశిక్షా హారా - మోక్షప్రద విరూపాక్షా భవా ॥౪॥ అంగజహరా - మంగళకరా - గంగాధరా నన్ను కరుణించరా ॥౫॥ ఇందుధరా - నందాకరా - కుందబృందశరత్కుందనిభాంగా ॥౬॥ ధీరా

వనా - స్మేరాననా - భూరిభూధరచాప పురసూదనా ॥౭॥ ఆగామవేద్యా - అమరేశవంద్యా-భోగిభూష నన్ను పోషించవయ్యావ ॥౮॥ ధూర్జటి మల్లి-కార్జునుని-అర్జవముగ బ్రోవుమయ్యా శివా ॥౯॥

బేహాగ్ రాగము - ఆదితాళము

నిటలాక్షా ననుబ్రోవరాదా - హరాహరాహరాహరా ॥నిట॥ హాటకనగ బాణాసన సురనుత - మాటికి నే, వేడ నను-కటాక్షించు॥ నిట॥ పుంగవవాహ భు-జంగమభూషణ - అంగజసం,హార ధృతకు,రంగ లింగ॥ నిట॥ పక్షీంద్రధ్వజ - బాణ కలుషహర - ఈ క్షణమే, బ్రోవగదే - దక్షశిక్ష॥ నిట॥ మును మార్కండేయుని ముదమున బ్రోచిన - ఘనుడని నే, వినిశరణం-టిని యిపుడు॥ నిట॥ మహిని తాడికొండ - మల్లికార్జునుని - అహరహమున్, బ్రోచిన శ్రీ-మహాదేవ॥ నిట॥

పంతువరాళిరాగము - ఆదితాళము

ధూపమాఘ్రాపయామి - కైలాసవాస॥ ధూ॥ ధూపమాఘ్రాపయామిదీపమపిచదర్శయామి-పాపహర సమీరగగనభరితదురితశాంతయే॥ ధూప॥ కోమలతరబిల్వకుసుమ - ధామసితవిభూతిభిశ్చ-సోమశిరసిశివసహస్ర-నామపూజనంవిధాయ-॥ధూ॥ వ్యాఘ్రచర్మవసన, సుర - వ్యాఘ్రనాసికాసుఖాయ - శీఘ్రమిహ సమర్పణం - సమాఘ్రాణనం కురుష్వ॥ ధూ॥ పాత్రనిహితధూమ రహిత -‌ చిత్రభానుగణగణేషు - చిత్రతరసుగంధవస్తుపాత్రసుఖకరం నిధాయ॥ ధూ॥ రాజరాజసఖముసీంద్ర-రాజమానముకుటఘటిత - రాజ మహాతేజ మహారాజ

సదుపచార కలిత ॥ధూ॥ దిగ్గజధృతభూశతాంగ - దీనజన కృపాంతరంగ - గుగ్గులుమహిసాక్షీవాస - గోఘృతసాంబ్రాణి ముఖ్య ॥ధూప॥ నాకధునీ శీకరాభి-షేకాంచితశేఖరాయ - శ్రీకరకరవామకర-శ్రీగిరిమల్లేశ్వరాయ॥ ధూప॥ పావన బెలిదీవి ముల్గు పాపయారాధ్యతనయు - భావభవభవచ్ఛరీరభావితం నుసేవితం॥ధూపమాఘ్రాపయామి॥

మంగళహారతి

మంగళం మంగళం మజ్జననీకి॥మంగళం మంగళం॥ మంగళం తరుణకురంగనేత్రికు సారంగయానకు మోహనాంగికిని-అంగజహరునియర్ధాంగమందున నుండి - పొంగుచు భక్తుల బోషించు తల్లికి॥ మంగళం॥ మాతకు కరుణాసమేతకు - దీనాఘతాత్రికు దైత్యవిజేతకును - పూతకు వృజినవిఘాతకు - షట్ప్రకాశ్రితకు వినుతవిధాతకూను జయ॥ మంగళం॥ అంబకు చికురరోలంబకు భక్తావ - లంబకు ముఖచంద్రబింబకును- అంబుజాప్తనికు- కుంబవిభాసకు- కంబుకంధరకు బిం-బాధరకు జయ॥ మంగళం॥ దుర్గకు పరికృతవర్గకు - విబుధసంసర్గకు - దత్తాపవర్గకును- నగాదిమానిక స్వర్గరాణ్ముఖసుర- వర్గసన్నుతకు భర్గురాణికి జయ॥ మంగళం॥ కాళికి సతకంజహేళికి - నుతసురపాళికి - నసదృశకేళికిని - శూలినికి ఘనవేణినిర్జిత - వరవ్యాళికి - గతిజితమరాళికిని జయ॥ మంగళం॥ చండికి వర చాముండికి - బహుళదోర్దండికి వైరివిఖండినికి - అండబాయక తాడికొండ మల్లయహృత్పుండరీక సంచారిణికి జయ॥ మంగళం॥

## మంగళహారతి

హిమగిరిజామానసకమలభృంగ-నీకు॥ మంగళం-శుభమంగళం॥ కమనీయ వేష సంకలిత భుజగభూష॥ మంగళం శుభమంగళం॥ గజముఖజనక - అంగజగర్వహర నీకు॥ మంగళం-శుభమంగళం॥ అజముఖామరవినుత-కాంఘ్రియుగళ నీకు॥ మంగళం - శుభ మంగళం॥ కరధృతశూల-భీకర పురహర నీకు॥ మంగళం- శుభ మంగళం॥ హర హేమశైలభాసురశరాసన నీకు॥ మంగళం - శుభమంగళం॥ ధరను వేములవాడ-పురరాజేశ్వర నీకు॥ మంగళం - శుభమంగళం॥ కరుణాసాగర భక్త-కలుషసంహార నీకు॥ మంగళం - శుభమంగళం॥ అహిరాజశయననేత్రాంబు జార్చిత నీకు॥ మంగళం - శుభమంగళం॥ మహిత తాడికొండ మల్లికార్జుననుత - మంగళం - శుభమంగళం॥

## మంగళహారతి

మంగళం బనుచు పాడరె - రాజేశ్వరునకు॥ మంగళం॥ మంగళం బనరె సారంగ-నయనలార మీరు పొంగుచు కర - పల్లవముల బంగరరివాణములు బట్టి॥ మంగ॥ నందివాహనునకు భవునకు - వందారుమౌని-బృందవందితునకు హరునకు - కుంద మందారపిండ-చందనమరంద బిందు - సుందరనిభగాత్రునకును మందరీకృతాచలునకు॥ మంగ॥ అంగజాంగభంగకరునకు - సర్వాంగభస్మలింగితునకు కలుషహరునకు - లింగరూపునకును దారుకాంగనాభుజంగునకును - సంగరహితునకును - ఖట్వాంగ ధారునకును జయ॥ మంగ॥ శరధితూణీరధరునకు - కరుణాకరునకు - గిరివరకోదండధరునకు - ధరణి వేములవాడపురని -

నిరతము వసియించి భక్తవరులను రక్షించు త్రిపుర - హరునకు జగదీశ్వరునకు॥ మంగ॥ కాండజాతనయనశరునకు - వేదండ దైత్యోద్దండగర్వాపహారునకు - అండజాయకను - తాడికొండ మల్లికార్జునహృత్పుండరీకాంతరమున నుండి పోషించు సామికి॥ ॥మంగళం॥

## మంగళహారతి

నిటలాక్షా హారతీ చేకోరా - మహోక్షాతురగసుధీరా॥నిట॥
దక్షశిక్షకరుణాకటాక్షా - నలినాక్షప్రియధనదపక్షా॥నిట॥
దేవదేవా హర వామదేవా - భవ భావ భవవిపినదావా॥ నిట॥
ఇందుకళాధర సుందరాంగ - కుందబృందదరసన్నిభాంగ॥నిట॥
గౌరీనాథవిబుధసనాథ - పరివారాప్రముథగణయూథ॥ నిట॥
భిల్లవేష భక్తపరితోషా - శర్వ మల్లికార్జునపరిపోష॥ నిట॥

---

## బిలహరి - ఆదితాళము

కర్పూరహారతులివ్వరె - నేర్పుతో మనభీమేశునకు - దర్పకాత్మజబాణునకు - సర్పహారునకు గిరిజాతార్పితార్ధాంగునకు మీరు॥కర్పూ॥ వందితజన పోషునకు - వనజాతారిభూషునకు - సుందరమృదుభాషునకు - కుందచందనారవింద - మరందబృందనిభాంగునకు॥ కర్పూ॥ సంగతాద్రిశృంగునకు - నదమలాంతరంగునకు - పుంగవేంద్రతురంగునకు - గంగధరునకు శరధి - నిషంగునా కభంగునకు॥ కర్పూ॥ ఘోటకీకృతవేదునకు - ఘోరారివిభేదునకు - హాటకాచలచాపునకు పాటితాఘునకు ముని - కోటిపురనివాసునకు॥ కర్పూ॥ తల్లజదారూవనమౌని -

పల్లవోష్ఠీలోలునకు - ఉల్లసితహరిమధ్యునకు - నుల్లమలర
తాడికొండ - మల్లికార్జునపోషునకు॥ కర్పు॥

కాంభోజిరాగము - ఏకతాళము

సారసాక్షులు మారవైరికి హారతూలివరే - నీహారకాశ
పటీరతార - హారహీరతార డిండీరనిభాకారునకు॥ సార॥
తారకుధరవిహారునకు వం - దారుసందోహ - మందారునకు
ఫణిహారునకు - క్రూరపురసురవర - భూరిమదవిహారునకు॥
॥సార॥ పుంగవేంద్ర తురంగునకు - భస్మాంగరాగునకు-సారంగ
ధరున కభంగునకు - సుత్తుంగభంగ సంగగంగా - రంగదుత్త
మాంగునకు॥ సార॥ కాండజాంబకకాండునకు - మార్తాండ
నిలయునకు - వేదండదైత్యవిఖండితునకు - దండధారోద్దండ
గర్వఖండన ప్రచండునకు॥ సార॥ భృంగసన్నిభగళునకు శరధి
ని - షంగునకు సతతము ముప్పొంగుచును రామన్నపేట నెసంగు
రామలింగేశునకు - సంగతగణపుంగవునకు॥ సార॥ పల్లవీకృత
దారువనముని - తల్లవోషునకు - ప్రతిల్లజారాద్యవల్లభునకు -
నుల్లమలర తాడికొండ మల్లికార్జునపోషునకు॥ సార॥

శంకరాభరణము - రూపకతాళము

మంగళం శ్రీసోమేశా - శుభమంగళం పాతభవపాశా-
మంగళం వృజినవిభంగ ధృతకురంగ - పుంగవేంద్ర తురంగ
భస్మాంగ॥ మంగ॥ భేశవిధృత కీనాశా - మదవినాశా పాల్కురికి
సోమేశా - కాశసంభవజనక శ్రీశా విశిఖ భూతేశా - సర్వేశ
లోకేశమహేశ॥ మంగ॥ తారాకుధరవిహారా నీహారా -
నగజాచిత్తచోరా - మారాగర్వవిదారా మారా మునివార

సేవితపద సారసయుగళా ॥మంగా॥ పుండరీక దైత్యగర్వ -
విఖండన పటుతరశర్వ మండిత శ్రీతాడికొండ మల్లయహృత్పుం
డరీకమార్తాండ మహోద్దండా॥ మంగాళం ॥

కళ్యాణిరాగము - ఏకతాళము

మంగాళారతి ఈశా - జితభవపాశా - మహనీయసం
కాశా ॥మంగా॥ మంగళారతి పుంగవేంద్రితు - రంగధృత
సారంగ - శరధి నిషంగ మనసిజ మదవిభంగా - భృంగినాట్య
నుషంగలింగా ॥మంగా॥ సామజాసురశోషణా చరణాంగుళీ -
భీమనిర్జిత రావణా - సోమశేఖరమాని జిష్ణుస్తోమమానసధామ
కలుష - విరామసన్నుతరామ - జగదభిరామ - పురహరవ్యోమ
కేశా ॥మంగా॥ భుజగాధిపతిభూషణా - విశ్వేశ్వర విజయ
ప్రహార - తోషణా - దానవచయ సంహారపురాంతక - రజత
భూధరవరనికేతన - గజముఖాది కుమారజనక - సరోజభవ
నుతహార మహేశా ॥మంగా॥ కుండలీకృత కుండలా - దక్షా
ధ్వర - ఖండనమతిమండలా - పుండరీక సురారిజితిభవ-కాండ
సంభవకాండ మరు- త్ప్రచండరుగ్జితకరణ తాడి-కొండమల్లయ
హృన్నివాసా ॥మంగా॥

రేగుప్తిరాగము - ఏకతాళము

ఆరతిమద్గూహూలింగా - కరుణాంతరంగా ॥ఆరతీ॥ ఆరతీ
మద్గూహూలింగా - సారభస్మోద్ధూళనాంగా - భూరిషడ్వికార
భంగా - సారసాలింగాంగసంగా ॥ఆరతి॥ ఘోరస్వాంతర్భావ
విదూర - షట్స్థలసీర - భారవీరాశైవవిచారా - భారవృజినౌ
ఘతిమిరా - సురకోటిమారసదృశా - చారుతరమంగాళకారా

మేరుధరాధరనిభధైర్యా ॥ఆరతీ॥ ఖండితాన్యమతసంచయా - అష్టమదవి - ఖండన తత్పరహృదయా - కాండజ సంభావ కాండా - కాండదివిషత్కాండతారా - మండలాతుండీప్రకాండా పాండురా - యశఃపూరకాండా ॥ఆరతీ॥ సేవితాశిష్యమను ప్రదా - వేదవేదాంతాభావితా తత్త్వ మనోహ్లాదా భావజ వైరిచరణ - రాజీవయుగ్మసేవ్యమానా శోషితానితచారితా - భావితాశాపాశజైత్రా ॥ఆరతీ॥ పండితసద్వంశ - నిధానా - దేశిక వర్యా - మండనా శ్రీరాజాభిధానా - మండితా శ్రీతాడి కాండా - మల్లికార్జున హృదయ - పుండరీకాంతరవాసా కుండలి రాణ్ణిభవాగ్విలాసా ॥ఆరతి॥

పంతువరాళి సావేరి - త్రిశ్రగతి

హారతీ జయతు తే సదా - శ్రీపార్వతీశ॥ హార॥ హార హీరసారసాబ్జ - తారనీహారపటీరశారదాభ్ర - మందారసన్నిభ విశదదేహా॥ హార॥ శంబరరిపుగర్వఖండన - రాజీవమిత్ర - బింబనిలయచంద్రమండన - అంబుజాసనాదివంద్య - సాంబ కలుషశైలశంబ -యంబరాకేశ వి-డంబిత కృపాకరపోష॥ హార॥ వైరినివహామదవిశోషణా - మహానింద్రహృత్సరోజమిత్ర - భోగి భూషణా - నీరజారిసూర సమీరసఖత్రిలోచనా - సరీసృపారి వాహజనక - భూరిపురవిదారహారా॥ హార॥ కాండజాతశయన పూజితా - సుమేరుకోదండయుక్త-బాహుభాసితా - కాండ ధరోద్దండగర్వఖండన ప్రచండసర్వ - కాండకాండరక్షణ - ప్రకాండకాండ పుంగవేంద్ర॥ హార॥ భిల్లవేషఫల్గునాస్త్రదా- భవానీహృత్ఫుల్లకమలవిమల శాతదా - ఉల్లసిత తాడికాండ

మల్లనారాధ్యపోష - తిల్లదార్యకల్పవల్లి మల్లికార్జునా॥
॥హారతి జయతు తే సదా॥

నీలాంబరిరాగము - ఏకతాళము

శ్రీగౌరినాథునకు మంగళమనరే - యోగిహృద్గేహు
నకు॥ వాగీశముఖసుర - వ్రజసుసగ్రాహికి - నాగరాజవిరాజ
మానహారికి - నతశౌరికి॥ శ్రీ॥ రజతాద్రినివాసికి - భక్తా
గ్రణివిజయప్రహాసభాసికి - వృజినమహాఘరవిసరదంభోళికి -
భజనపరమానవవ్రజపరిపాలికి - త్రిశూలికి॥ శ్రీ॥ పుంగవ
రాడ్వాహికి - సర్వలోకభంగ - కృత్పురహారికి - అంగజాత
మదవిభంగికి - విమలభస్మాంగరాగికి - విగతసర్వాంగికి - నిస్సం
గికి॥ శ్రీ॥ కంకాళధరపాణికి - సుధారససంకలితమృదువాణికి -
కంకణాలంకృతశాద్రివేయికి - వేణువంశనగరనివాసికి -
దరహాసికి సువిలాసికి॥ శ్రీ॥ శుండలాజినధారికి గర్వితసర్వచండ
వైరివిదారికి - అండజాయక తాడికొండ మల్లయ హృత్పుం
డరీక - విహారదృఢతరమోదికి - గరళాదికి॥ శ్రీగౌరినాథునకు॥

కేదారరాగము - రూపకతాళము

జయమంగళారతిదే-జగదంబే శ్రితపంకజరోలంబే-
జయ॥ భయహారిణి కాత్యాయని రీ - దయయా మాం పాహి
గౌరి॥ వియదవ్రతసంచారిణి - నిఖిలలోక - సంరక్షిణీ -
భయదాఖిలరూపిణి- శ్రుతిచయ - కథితార్థస్వరూపిణి॥ జయ॥
తారాచలవాసిని సుర - జాలార్చితపదయుగళే - తారాధిప
వదనే - కేదారపతిమనోహారిణి - క్రూరాఖిలరిపువిలయే - భూరి
జ్వాలన్మణివలయే - ధీశ్రీ మల్లికార్జునహృత్సారసనిలయే
సదయే॥జయమంగళా॥

పున్నాగరాగము - ఆదితాళము

ఆనంద మానంద మాయెనే - జీవాత్మైక్యసిద్ధి నేటి
కాయెనే - జంగమాంఘ్రిసంసేవ నేడు గల్గెనే - ఇదిగో మాన
సాభ్రమున చిన్మయసూర్యు డుదయమాయె॥ ఆనంద॥ యోగ
మర్మములన్ని దెల్పెనే - విషయరాగాదిలతల బట్టి మల్పెనే-
కర్మత్యాగశేముషి సమకొల్పెనే - తాను భోగములన్ని లింగ
బుద్ధీ నూహింపుమానె॥ ఆనం॥ కరము మస్తకమందు జేర్చెనే-
తనకరుణార్ద్రదృష్టి దాని గూర్చెనే - దుఃఖకరమైన సంసా
రము బోకార్చెనే - దివ్యతరమగు వేధాదీక్షా దయనేయ
గల్గె నేటి కా॥ నంద॥ హస్తాబ్జమందు జనిమ బెట్టెనే నాదు
విస్తారదృష్టి దాని గూర్చెనే - యిదే వస్తువు నేనని - ముట్టెనే
సుప్రశస్తమా క్రియాదీక్షా శ్రయునిగా జేసె నేటి॥ కానంద॥
వర్ణషట్చక్రపద్ధతి దెల్పెనే - దక్షిణకర్ణమునందు మనువు
గూర్చెనే - వాయువు జీర్ణమయ్యేటట్లు దిప్పెనే - జన్మార్ణవ
బాడబామా మంత్రసిద్ధి యొసంగే నేటి॥ కానంద॥ స్వాం
తమునందు మోదమందెనే - ముక్తికాంతాతో భోగరతులొం
దెనే - నాదు చింత దుర్విషయములు గుందెనే - యిక భ్రాంతి
సంసారజ్ఞప్తి బాయక కల్గె నేటి॥ కానంద॥ మనసు లింగము
నందు నుంచెనే - స్థూలతనువు గురుమూర్తి దాసిపించెనే -
సర్వధనము జంగమున కర్పించెనే - శివ తానూ నే నానే
మాట - స్వప్నమందు లేకుండగ జేసె॥ ఆనంద॥ మారారి
భక్తగణవర్యుడు పండితారాధ్యవీరేశలింగార్యుడు - జగదా
రాధ్యవర్య వీర్యధుర్యుడు - సిద్ధవీరాంతేవాసిహృదయవీథీ
పాదాబ్జమూన ॥కానంద మానంద మాయెనే॥

కేదారరాగము - చాపుతాళము

లాలిలాలీలింగ లాలిశివలింగా - లాలిలాలీలింగ లాలిభవ భంగా ॥లాలి॥ ఘనకరస్థలకర్ణికాపీఠమందు - ఘనయిష్టలింగ సంగతి - కళయు నిలిపి - పరాపశ్యంతిమధ్యమా వైఖరీచేరులాను - బాగుగాన్యా చేరి భక్తులందారా ॥లాలి॥ ఉత్తమక్రియలుడుగ కుండుటే పాటితప్పకను శివు మదిని - దలచుటే సూటి - తత్వ గురువాక్యములు దలచుటే మేటీ - గుర్తెరుగరాసి దే సుఖమిదే బోటి ॥లాలి॥ సావయవసద్గురుని సద్భావమందు - సావధానత చేత సంపూర్ణుడగుచు - షట్త్రింశత్తత్వ పూజోపచారములా- సంతృప్తిగావించి సంతోషమలరా ॥లాలి॥ లింగాంగసంధాన లీను గావించి - నాదబిందూకళల లయ మేరుపరచి - వేయు రేకుల కమలవీథిలో వలసిూ - సూక్ష్మరంధ్రమునందు జ్యోతి మై వెలుగ ॥లాలి॥ గురుకటాక్షముచేత ఇదురుగా నిలిపి - లక్ష్యసమరసభావలయు మేరుపరచి - యిష్టలింగమునందు నిర వుగా నిలిపి - ప్రాణలింగము లీల బాగమర జేసి॥ లాలి॥ భావలింగ పరిణవపాన్పుగా జేసి - పారిసాదవర్గమే బాలీసుచేసి - తన్మధ్య నూర్ధ్వశిఖార్ణవబీజమందూ నిదురబో లింగయ్య నిఖిలంబు వెలుగా ॥లాలి॥

ఆనందభైరవిరాగము - ఆదితాళము

ఊచుమని వనిత లూచా పాడుమని, పరిమళింధయ్యెల్లా- ఆడుమని భృంగి యాడ - వుయ్యాల లూగు శ్రీనీలకంఠా ॥ఊ॥ శంకావిదూరుడగుచూ భవదీయపంకేరుహాములయందూ - సాంఖ్యపరిసాధనములా శరణం భవదంఘ్రి బాడెద వుయ్యాలా॥ ఊ॥ వరహేమకమలమందు - చంద్రరవికిరణదీప్తులు మెరయగా

పరవి చిత్కళలస్సైనా - సద్గురుని వరసి పాడిరి వుయ్యాలా॥ ఊ॥
వేయి వేలస్తంభములను - నవరత్నకీలితంబగు మేడలో - స్త్రీలు
పురుషులందరు భక్తవరలోలు బాడిరి వుయ్యాలా॥ ఊ॥ ఆధార
కమలమందు భూసురులు - హార్ష్మ మన సేవించగా - ఆదిమధ్యాం
తరములో - కొలువయిన ఆధిపు బాడిరి వుయ్యాలా॥ ఊ॥ ఆహాక్షి
త్రివిధమయిన - పంచసంస్కారముల నిను గొల్వగా - మేరు
శిఖరములయందూ - కమనీయుదారు బాడిరి వుయ్యాలా॥ ఊ॥
అపరిమితమైననాదాబిందుకళ లమరినది నిగమాంతము - అవ
ధానమగు చేరులా అమరినది రమణేమించిన వుయ్యాలా॥ ఊ॥
చిద్రూపకళమునందు ఖేచరులు నిద్రావిహారులగుచు - రుద్ర
కన్యలు గొలువగా కరుణాసముద్రు బాడిరి వుయ్యాలా॥ ఊ॥
రాజీవదళమునందు రమణులు రాజసంబున గొల్వగా - రాజాధి
రాజు లవ్వాడు గిరికన్య రాజు బాడిరి వుయ్యాలా॥ ఊ॥ పద్ధతిగ
షోడశమున సన్న్యాసులు శుద్ధశైవులు గొల్వగా - బుద్ధావతారు
లగుచు - సుగ్రీకపర్ది బాడిరి॥ వుయ్యాల॥

ఇది శ్రీమేధావతీశనామూర్తి కృపాకటాక్ష లబ్ధకవిత్వవైభవ
తాడికొండవంశపయఃపారావారరాకాసుధాకర శ్రీశైల
ప్రాగ్ద్వారప్రణవపంచాక్షరీ తులాభారప్రసిద్ధ రాజ
లింగారాధ్యపుత్త్రి బుధజనమిత్రి మల్లికార్జుననామ
ధేయ ప్రణీతంబయిన గద్యపద్యాత్మక కీర్తనా
దికము సంపూర్ణమయ్యెను.

కరకృత మపరాధం క్షంతు మర్హంతి సంతః.

సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ